శ్రీరస్తు

శ్రీ గణాధిపతయే నమః ।

# రుక్మిణీపరిణయ నాటకము

అను శ్రీ కృష్ణ విలాసము.

కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా కటకానిపల్లె గ్రామం శ్రీ రామచెంద్ర్యుల కంకిలంబావంగి మార్కాపురం తాలూకా రామసముద్రము గ్రామం కాపురస్థుడు బెవవాడ బ్రంహ్మయాచార్యులచే రచియింపబడి, నర్సారావుపేట గ్రామం కాపురస్థుడు ప్లీడరు ఆలూరుగోపాలరావు గారిచే పరిష్కరించబడినది.


గ్రంధకర్తలు { వెలుదండ పెద్ద సుబ్బరావు,<br>వెలుదండ చిన్న సుబ్బరావు.<br>వెలుదండ బాల సుబ్బరావు.



మొదటి కూర్పు 250 ప్రతులు.

కర్నూలు షరీఫ్ అహమద్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.


 1928 { వెల అ. 0-8-0.

శ్రీరస్తు

శ్రీగణాధిపతయే నమః

# శ్రీ లక్ష్మణాపరిణయ నాటకము



అను శ్రీకృష్ణ విలాసము.

కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా కటకానిపల్లె గ్రామం శ్రీరామచంద్రుల కంకితంబొనరిగి మార్కాపురం తాలూకా రామసముద్రము గ్రామం కాపురస్థుడు బెజవాడ బ్రహ్మయాచార్యులచే రచియింపబడి, నర్సారావుపేట గ్రామం కాపురస్థుడు ప్లీడరు ఆలూరు గోపాలరావు గారిచే పరిష్కరించబడినది.


గ్రంధకర్తలు { వెలుదండ పెద్ద సుబ్బరావు, వెలుదండ చిన్న సుబ్బరావు, వెలుదండ బాల సుబ్బరావు.



మొదటి కూర్పు 250 ప్రతులు.

కర్నూలు షరీఫ్ అహమద్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.





1928 { వెల అ. 0-8-0.

# శ్రీలక్షణాపరిణయ నాటకము.

## ప్రారంభము.

శ్రీరఘు వీరుడార్య జనసేవితుడాశ్రిత రక్షణుండు గోత్రారి పురారి స్తుత్యుడ సురాంతకుడౌ కటకానిపల్లెలో జేరి వసించు రాముడిల శ్రీకర మొప్ప గృతార్థు జేయు విస్తార దయాఢ్యులైన వెలుదండ కులోద్భవులన్ ముదంబునన్.

కం॥ శ్రీరామచంద్రునకుప్రియ ।
నారీమణి లోకజనని నలినాస్యశుభా ।
కారయగు సీతపెదసు ।
బ్బారావున్ బ్రోచుగాత పరమప్రీతిన్ ॥

కం॥ శూరుడు మతిమంతుడు సగ ।
ధీరుడు హనుమంతుడధిక తేజోవంతుం ।
డారయ సతతము చిన సు ।
బ్బారావునకొసగు భువిని బలమును యశమున్ ॥

కం॥ మారారిప్రియ కళత్రను ।
చారిత్ర పవిత్ర భక్త సంస్తోత్రియునోం ।
కారియగు గౌరిబాలసు ।
బ్బారావున కొసగు శిరులు ప్రమదము మీరన్ ॥

సీ॥ శ్రీకరంబైనట్టి చెన్నపట్టణమను మద్రాసుయందు సద్భద్రమలరు కర్నూలుజిల్ల మార్కాపురీతాలూకయందున లక్ష్మిచెన్నొందునట్టి కట కానిపల్లెలో స్వాటతరంబుగ నుందు బ్రంహ్మవంశోద్భవుల్ ప్రౌఢమతులు సత్యప్రతిజ్ఞానుచారులార్యహితులు విమలప్రభావులార్వేలవారు ॥ గీ॥ అట్టి యార్వేల వంశాబ్ధినవతరించి గణితశాస్త్ర ప్రవీణతగలిగి కవిత । గలిగి భూమీశమన్ననల్ గలిగి ధరణి । దండికీర్తిని గొనిరి వెలుదండవారూ ॥

కం॥ ఆవెలుదండకులాబ్ధికి ।
భావింపగ శశియనంగ పరమపవిత్రు
డీవసుధ జననమయ్యెను ।
కోవిదులలరంగ భూరిగుణుడౌ శ్కరుడున్ ॥

కం॥ పాత్రుండన్నిటి కౌశిక
గోత్రజుకును శత్రుహరుడు కోవిదమిత్రుం।
డీత్రిజగంబులను సుచా।
రిత్రుండు పవిత్రుడ మితశ్రేష్ఠుండరయన్ ॥

సీ॥ ఆశ్రితవిద్వజ్జనా ధారుడద్వైత భావనుండు ఘనుండు ధీవరుండు। విద్యా తిశయముచే వెలయువాడ షడ్వైరి గ్రంథార్థములనెల్ల గనినవాడు పండితుండాచారపరుడు చతుర్వేద గోచరుండౌదార్య గుణగణుండు। ఆడితప్పనివాడు నాత్యమిత్రుడు సదా దైవభక్తి నటించు ధర్మశాలి ॥

గీ॥ ఆంధ్రిసంస్కృతము నశ్రుతులల్లువాడు।
భాను తేజుడు నిరతాన్న దానపరుడటం
చు బుధులెంచుచుండంగ నలరెవంశ
భూషణుండైన వెలుదండ శేషఘనుడూ ॥

క॥ ఆమహానీయుని కులకాం।
తామణి శితమ్మ యనగ దనరుచునుండెన్
భూమిజయనసమమగునీ
భూమినియనియల్లజనులు బొగడుచునుండన్ ॥

గీ॥ ధవుని నెడబాసి రావణోద్యానమందు
మునిగి తేలెను పతిమానములును దుఖః
జలధియందట్టి కష్టముల్ చాలపొందినట్టి
సీతకునీసీత నాట్టుబోల్పా ॥

క॥ రాముని నతియై భూసుత।
ప్రేమవిడిచి దుఃఖమొందె పృథ్విని సుగుణ।
సోముడు శేషుని నతియై।
యేమాత్రము చింత నెరుగదీ సీతమయున్ ॥

క॥ ఆ దంపతులకు నరయగ।
మోదంబలరంగ దత్తపుత్రుడటంచున్।
మేదినికి ౯ నిగాన కవి।

తాదక్షుడనంగ నతని దరమె పొగడఁగన్ ॥

ఉ॥ దానమునందు శౌర్యమున ధైర్యమునందు కవిత్వమందు
సుస్నానమునందు వేదమున సత్యమునందు స్వరూపమందునన్
గానమునందు సీలమున గౌరవమందున పేరుగాంచుచున్
వేసుతికెక్కెనౌరభళిధీరుడు కొండమరాజు నన్నఁగన్ ॥

క॥ అతనికులసతి ధరప్ర
ఖ్యాతినిగన సుబ్బమాంబయనునామమునన్
ప్రీతిగ నెల్లారుజగన్
మాతయనుచు బొగడిరాత్మమమతనటింపన్ ॥

చ॥ అనయముజీవితేశు చరణాబ్జములన్ మదినిల్పినాథుడే
ఘనుడని మోక్షకర్తయని ఘట్టిగనమ్మి భజించుచుండెనంచును
భువి నెన్న నాగిరనసూయకునీమెకు భేదమేమిలేదనుచు
పతివ్రతామణులు నౌరభళీ పతిభక్తియేమనన్ ॥

క॥ ఆ జలజాక్షికి కొండమ।
రాజునకున్ సుతులు లేమి రమణీయుడు రా।
జేజాను చినతిరుమల రా।
వీ జగతిని దత్తపుత్రు డేర్పడనయ్యెన్ ॥

సీ॥ సకలవిద్యల పద్మసంభవుండే చిన్న తిరుమలరావు ధాత్రిని గనంగ
ఘనకృపామతియందు వనజాక్షుడే చిన్న తిరుమలరావు ధాత్రిని గనంగ
రౌద్రంబునను కాలరుద్రుడే వర చిన్న తిరుమలరావు ధాత్రిని గనంగ
భోగంబునందు నాపురుహూతుడే చిన్న తిరుమలరావు ధాత్రిని గనంగ ॥

గీ॥ ననుచు సజ్జనులే వేళ నభినుతింప।
నరులలో కీర్తిగాంచి యీ ధర జరించె।
అట్టి చినతిరుమలరావున కలరునట్టి।
సతిసుమతి పుణ్యవతి పతివ్రత సుచరిత ॥

క॥ గోవిందమాంబ యనగా ॥
నీవసుధను వన్నెకెక్కెనే ప్రొద్దును స।

ధ్భావమున పతిని నిల్పుచు।
దావదలక గొల్చు సాటితరుణులు భోగడ౯॥

శా॥ భావింప౯ పదునాల్గులోకములలో పద్మాక్షులందీ।
మహాలావణ్యంబును యీ మృదుత్వమును శీలంబీ
సదానందమీ దైవ ధ్యానము లేదు లేదనుచు సత్యం
బంచువాదింతురీ గోవిందమ్మగుణంబు లెన్నుటకు నా
గోవిందుడేగావలె౯॥

గీ॥ అట్టిగోవిందమాంబగర్భాబ్ధినవత రించి
రిల హిమధామములటంచు మేటి గాంచ నెంచు
పరాక్రములంచు ముచ్చ్వరర్క తేజులు
శ్రీవిక్రమార్క యశులు॥

వచనం॥ వారలెవ్వరనినా.

కం॥ పెదసుబ్బారావు మహా
సదయుడువ్యవహారపరుడు శరణన్నునదా
వదలడు శత్రువునైనను
ముదమలరగనటుల బ్రోచుపుణ్యుడుగల...॥

క॥ చినసుబ్బారావన విల
యినని భతేజుండు వెలశి ఇంగ్లీషును వ
రనుగాంచె నేర్పరియటం
చును సద్గుణశాలియనుచు సుజనులుపొగడ౯॥

క॥ ధీరుడు సుకుమారుడు బలు
శూరుడు సుగుణుండు బాలసుబ్బారావి
ద్ధారుణి నాధన్యుని న
వ్వారును బొగడంగలేరు ఫణిపతిదక్క౯॥

గీ॥ వారిలో జ్యేష్ఠుడైన ధీవరుడు పెద్ద।
సుబ్బరావు వరించెను సొంపు గులుకు।
వెంకమాంబను రామ భూవిభుడు భూమి।

జాతను వరించినట్లు విఖ్యాతిదనర ॥

కం॥ ఆ వెంకమాంబ పుత్త్రుడు।
భావజుడే సుందరమున బాహుబలుండుల్ ।
ధీవరుడిల శ్రీ సుబ్బా।
రావనగను పేరుగాంచె రశికులు మెచ్చన్ ॥

కం॥ ఆ సుబ్బారావిలబలు।
వాసిగ చేపట్టె విభుదవర్యులు మెచ్చన్
శ్రీ సుందరాంబ యనగా।
భాసురముగ పేరుగన్న పరమపవిత్రన్ ॥

కం॥ చిన సుబ్బారావు వరిం।
చెను వేంకటసుబ్బమను ప్రసిద్ధిగ మున్నా।
వనజాక్షును నైదర్బి।
వనజాస్యను బెండ్లియాడు వైఖరి దనరన్ ॥

క॥ క్షితిబాలసుబ్బరావుకు।
సతి దా శ్రీ శేషమాంబ సాధ్వియనగ। స
న్నుతి జెందె నారమ్మన
వతులీమెను పొగడనట్టి వారలుగలరే ॥

గీ॥ ప్రవిమలాత్ముండునైన యాబాలసుబ్బ।
రావు మమ్ములరప్పించి రమణతోడ।
బల్కెనిట్టుల బెజవాడ బ్రంహ్మయాఖ్య।
నాటకంబులు రచియించుమేటివయ్యా ॥

క॥ అని లక్షణాపరిణయం।
బను గ్రంధము బద్యగతిని నదయము నాకున్ ।
విన వేడ్కగలదు నాటక।
మును జేయుము కోరినాడ ముదముదలిర్పన్ ॥

వ॥ అని జాంబూనదాంబర తాంబూలంబులొసంగిన నందుకొని కృతిక
ర్తలకోరకచే కటకానిపల్లి శ్రీరామచంద్రుని కంకితంబొసంగి నేనొనర్పం

బూనిన లక్షణాపరిణయంబను నాటకంబునకు కథాక్రమంబెట్టులనినా.

విఘ్నేశ్వరుని స్తోత్రము.

మ॥ త్రిజగత్స్తోత్రు త్రినేత్రు హృత్కమలమందెల్లప్పుడున్ వేడుకన్ ।
భజయింతున్ హిమవంతుపుత్రితనయున్ భక్తిన్ కవిత్వాంశక
న్నిజదేవున్ కరివక్త్రునాగధరునిన్ నిష్ఠన్ జతుర్బాహునయ్యా
జపుత్రున్ గణనాథునొల్తు కృతియందానంద మింపొందగన్ ॥

దరువు ఆదితాళము రాగము.

గణనాథా నన్ను బ్రోవరా కరుణించు వేడుచుంటిరా । గణ ॥ ఫణి రాజధరపుత్ర । పండితసంస్తోత్ర । ప్రణుతింతు వత్సాత్ర పలుమారునిన్ను ॥ గణ ॥ కరిరాజముఖునీకు చరణంబులే ప్రాపు । మనువాక పూజింతు మదినెంతు శ్రీ । గణ ॥ పన్నుగ వెలుదండ చిన్నసుబ్బారావు నన్నూత నీవు. నావిన్నపమెంచు । గణ ॥

సరస్వతి ప్రార్థన

చం॥ మృదుమధుశబ్దముల్ నొసగు మీనరసీరుహపాణి నాదు వాక్స
దనమునుండియున్ జలజగర్భునిరాణి సుకీరవాణి నీ పదముల గ
జ్జలందియుఱు బాగుగ జంఝణ మ్రోతలివ్వ నాయమనటను నృ
త్యమూడుచును యింపుగ దెల్పవేరాగవై ఖరుల్.

దరువు రూపక తాళము.

ఓం శారదాంబ హే సారస్వతి బ్రోవుమమ్మ ॥ ఓం ॥ సారెకు నీపద ములనే మారక గొలిచెదమనమున రారమ్మమ్మ నావాక్కున జేరుమమ్మ కోరితమ్మ ॥ ఓం ॥ వాణీ మ్రొక్కెద పల్లవపాణీ భారతిపద్మజురాణీ విరిబోణీ కల్యాణీ నీలవేణిజనని ॥ ఓం ॥ ఇంపుగ పండితులను రక్షింపుము నుండెద చెప్పెదను సొంపుగ వెలుదండ బాలసుబ్బారావు నేగతల్లి ॥ ఓం ॥

కథాప్రారంభము.

భటుడు దరువు ఆదితాళం.

వెడలివచ్చెను వేగా భటుడూ వేడుకమీరగా । వెడ ॥ వెడలివచ్చె

బహుఖవడిగనడచుచును గడుసుడనంబున గసుఘుచుజనులను ॥ వెడ ॥ ధాటిగమీానము దీటుకొనుచు నాసాటివారలెచ్చోటలేరుయుని ॥ వెడ ॥ తెన్నెతలమున కటకానిపల్లె శ్రీసీతారాములచేకొలచుచును ॥ వెడ ॥

పరిజనులు—స్వామీా మీారెవరు ?

భటు—నేను మద్రపురంబేలు బృహత్సేనమహారాజు చెంతనుండెడి భటోత్తముడనురా వోరీ.

పరిజనులు—అయితే తమరెచ్చటికి వచ్చినారు స్వామీా ?

భటు—ఇప్పుడు రాజుగారు కొలువుకూటంబునకు వొచ్చెదరు గాన నికొలువు శృంగారించగలందులకై వచ్చియున్నానురా వరే.

భటుడు. కీర్తన. ఆదితాళము.

జనులారా వినుడీ మనజనపతివొచ్చెను గనుడీ ॥ జను ॥ ఘనకరుణారసమును గల్గిన సజ్జన రక్షకుడనుకొనుడీ ॥ జను ॥ ఆడితప్పబోడూ దానబడిగిన లేదనడూ పోడిమితోడను బ్రోచును నరులను పుణ్యుడు ధర్మాకరుండు ॥ జను ॥ నాసిగకటకాని పల్లె నివాసుండౌ శ్రీని వాసుదేవుడే భావింపగ మనప్రభువు బృహత్సేనుండూ ॥ జను ॥

వ॥ ఆహా జనులార సత్యశాంత దానపరాక్రమ సుగుణగణ సమూహంబుల కాటపట్టయిన మన బృహత్సేన మహారాజుగారు నేటిదినంబున కొలువుకూటంబున కేతేరదలంచి వొచ్చుచున్నారు గాన మీారందరు సంతోషంబుగా గృహంబులలంకరించి కస్తూరిచే నలికించి ముత్యాల ముగ్గులుబెట్టించి పచ్చల తోరణంబులు గట్టించి మంగళవాయిద్యంబులతో పట్టణంబెల్ల నలంకరించి జాగ్రతగా నుండుడీ జనులారా. ॥

రాజు. దరువు. దర్బారు. ఆదితాళం.

రాజువెడలేను సభకూనపూడు బృహత్సేనమహా ॥రాజు॥ రాజువెడలె మహారాజయీాతడని భూజనులందరు బొగడుచుండగను ॥రాజు॥ కోటిభాస్కరులకాంతిమించీ। భాసిల్లురత్నకి। రీటముశిరమునందునుంచీ। మేటిపండితులుతనకిరుగడలను చాటుపద్యములు చదువుచునుండగ ॥రాజు॥ శ్రీనికటకానిపల్లెపురిని వెలుదండబాలసుబ్బారావును బ్రోచుహరిని।రాణతో

దలచుచు రమణులమందర వీరొలు మీటించుచు వేడ్కతో బాడగ ॥రాజు॥

రాజు——అహో మంత్రివరా

మంత్రి——ఏమి రాజేంద్రా

రాజు ॥ గీ ॥ మంత్రివర్య వినుము మనపట్టణంబున ।
కలుగు విప్రవరులు క్షత్రియులును ।
యూరుజులును శూద్రులొనరంగ తమ ।
కులాచారధర్మములను జరుపువారే ॥

మన పట్టణంబునగల చతుర్విధవర్ణంబులవారు వారి వారి వర్ణాశ్రమ ధర్మంబులు వదలక జార చోర మారీస్ఫోటక భాదలంబొందక సుఖంబు గానున్నవారా మంత్రీ.

మంత్రి——రాజేంద్రా వినుము.

సీ॥ ధర్మంబునాల్గుపాదంబుల వర్తిల్లు వాంఛించినప్పుడే వానగురియు॥ దగుపులే వేళను ధాత్రిమీర ఫలియించు । బైరులుదున్నక పండుచుండు । దిరి పంబు విరసమేనిక్కనగొదవదు । మొదవులు పిదుకకము న్నపితుకు । వ్యాధులు నఘములు వలనలై దూలించు । జింతింపగోర్కులు సిద్ధిబొందు.

గీ॥ మీరు పాలించు రాజ్యంబు మురియుచుండు । నతులకొరకును చింతించు పతులులేరు పతులకొరకును చింతించు నతులులేరు లేమిచేనుందు వారలు లేరులేరూ.

రాజు ॥ కం ॥ మనమగ్రపురమునగల
జనులందరు విమలసౌఖ్యసంపదలను బొం ।
దిన వారలంచు విననా
మనమానందంబునొందె మంత్రివరేణ్యా॥

రాజు ॥ వ ॥ మంత్రి మనమేర్పరుపంబడిన. దేవబ్రాహ్మణవృత్తులు సక్రమముగా జరుగుచున్నవా!

మంత్రి—— తమయాజ్ఞానుసారము జరుగుచున్నవి మహాత్మా.

రాజు ॥ వ ॥ మంత్రివిశారద మన సామంతరాజులందరు మనకంపవలశిన

కప్పములన్నియు వాయిదామీరక బంపుచుండిరా.

మంత్రి—వ॥ వాయిదామీరక వచ్చుచున్నవి రాజేంద్రా.

ప్రభావతి. దర్బార్ కహానరాగము. ఆది.

వెడలెప్రభావతి వేడుకమీరగ ॥ వెడ ॥ కడువేగా తన ప్రాణకాంతుని కొల్వజేర ॥ వెడ ॥ చెంగావిసరిగంచు చీరెను ధరియించి రంగులుగుల్కు నట్టి రవికె నేర్పుమరదాకిగి ॥ వెడ ॥ పరిమళగంధములు బాగొప్పవలదిమల్లె సరులు కీల్కొప్పునందు దురిమి సరివారుమెచ్చ ॥ వెడ ॥ శ్రీలచే వెలుగొండ । బాలసుబ్బయ సేలు । శ్రీలోలుకటకాన్పలి శ్రీరాము నెన్నుచూ ॥ వెడ॥

వ॥ హా మనోహరా యిదే పదివేల వందనంబులాచరించెద.

రాజు కం॥ పరిల్లవె కాంతామణి
పరిల్లవె భ్రమరవేణి వరపికవాణీ
పరిలు సైకతశ్రోణీ
పరిలుమో పువ్వుబోణి వారిజపాణీ ॥

వ॥ ప్రియసఖీ యిటుగూర్చుండుము కాంతాసీవిచ్చటికి రాగతంబేమి.

ప్రభా— నాథా?

చం॥ తనయులు లేని ధామమును దైవనివాసము లేని గ్రామముల్
వినయము లేని విద్యయు వివేకము మాలినయట్టి వైద్యముల్
జనపతి లేని రాజ్యమును సౌఖ్యనిరోధకమైన భోజ్యముల్
గనకము లేని భాగ్యమును సుగంధము లేని సుమంబువ్యర్థముల్

అ పుత్రస్యగతిర్నాస్తి) అన్నట్లు మనకు కుమారులు లేనందున గతులు లేనివారమగుదుముగదా? మహాత్మా!

రాజు—॥ వ ॥ కాంతామణి ఆ కొరంత నీకేనా? నాకు మాత్రము లేదా? దైవకృతము తప్పించు వారెవ్వరు? (నొసటను వ్రాసినవ్రాతకన్న కలదా సూరేండ్లు చింతించినను) అనునట్లు మనకు సంతానప్రాప్తంబుండినా ఆ పరమాత్మునే యిచ్చు లేకున్న మనమేమిసేయంగలవారము.

ప్రభా—మహాత్మా! అట్లనియన వేల పూర్వకాలంబున ప్రభాకరవిశాక ర వంశోత్తంసులగు రాజన్యచూడామణులెందరో ఆహారనిద్రలుమాని అరణ్యములపాలై అనేకవేల సంవత్సరంలు అపరమాత్ముని గూర్చి తపం బాచరించి సుపుత్రులగనినట్లు పురాణములు తామెరుగరా! మనశక్తి కొలది భగవంతునికి సేవజేసిగదా వారికటాక్షమువడయవలసినది.

షడ్భిర్ మనుష్యయత్నానాం నస్తమున్నైనచింతనం। బను నానోక్తి తామెరుగరా? గాన మనము యోగ్యమైన దేవునిగూర్చి యీదేహాభిమానంబువదలి తపంబాచరించితిము అంతట నా పరమాత్మునికి కనికరముగలుగను తప్పక మనకు పుత్రులుగలుగుదురు నాథా॥

రాజు—॥వ॥ మనోహరీ? అట్లయినను తపంబాచరించుటకేగువాడు ఒక్క మహాసీయుని ఆజ్ఞలేనిది పోరాదంటిరి అట్టి మహాసీయుండెవ్వరు మనకు ప్రాప్తించునో? అప్పుడు గదా మన ప్రయత్నములు సాగును ఇట్లా రాజదంపతులు చింతించుచుండు నంతలో నారదుండు.

నాదనామ. జంపు. ఆటతాళం.

శ్రీ రామనామము దలచినవారికి చేకూరనివస్తువు వేదిలోకమునా ॥శ్రీ॥ అండపిండాండ బ్రహ్మాండ లోకంబంత ఆ మహాసీయుని రూపామే గా ॥శ్రీ॥ మత్స్యమైసోమకుని ద్రచ్చి వేదముదెచ్చి ధాతానుకిచ్చినదీ తా ఁ డేగా। కూర్మావతారమునకు ధరమెత్తియు క్షీరసాంద్రముదరిపించిన దీ తాడేగా ॥శ్రీ॥ క్రూరరాక్షసుడొకడు కుంభినిచుట్టగ వరహామై వాసీని వధియుంచెగా। సరబోజనునిజంప బాలుడుప్రార్థింప నరసింహ్మావతారమె త్తెనుగా ॥శ్రీ॥ బలిచక్రవర్తిని రూపుమాపుటకును బాలుడైదితికుద్భవించెనుగా। పెద్దలపగటీర రాజులదంపగ పరుశురాముడై పుట్టెనుగా ॥శ్రీ॥ రావణాసురులాది రాక్షసుల జంప శ్రీ రాముడై భూమినిబుట్టెను గా। కంసునిదాడికి భూదేవి ప్రార్థించ కృష్ణబలరాములై పుట్టిరిగా ॥శ్రీ॥ కలియుగమొచ్చిన బుద్ధావతారమై కనులాకు గనపడకుండానుగా, కలి వెళ్లినప్పుడు కల్క్యవతారమై కలుషాములెల్లను బాపునుగా ॥శ్రీ॥ శ్రీ లచేతులతూగు కటకానిపల్లెలో శ్రీ రామచెంద్రుడై వెలసెనుగా। వాసీ గ వెలుగండ బాలసుబ్బయ్యను పోషింపుచుండేటి దేవుడుగా ॥ శ్రీరామ ॥

॥ సంధి ॥

ఇట్లు భగవన్నామస్మరణ గావింపుచు యేతెంచు నారదుంగాంచి రాజదంపతులు నారదుని యెరింగి యెదురుగా నడిచి మహాత్మా నారదమునీంద్రా ఇదే పదివేలవందనంబు లాచరించెదము.

నారదుడు—శుభంభవ సుఖంభవ రాజేంద్రా యిష్టార్థసిద్ధిః రస్తు.

రాజు—ఈ సింహాసనంబున గూర్చుండుడు మహాత్మా.

నార—మంచిది, కూర్చుందును.

సంధి—అటుల గూర్చుండి.

నార—రాజేంద్రా యెల్లరు క్షేమంబుగనున్నవారా? దంపతులేదియో దీర్ఘాలోచనతో యున్నటులున్నదే' నాకు తెలియరాని రహస్యమా? ఇతరులకు తెలియరానిదైన నే నితరులతో చెప్పుదునా!

రాజు—మహాత్మా అట్టి గూఢ విచారంబేదియును గాదు.

నార—అట్లయిన మరేమి?

రాజు—మహాత్మా నారదమునీంద్రా నేను తమబోటి పెద్దల అనుగ్రహమువల్ల రాజ్యకతంబున సర్వభోగంబు లనుభవించుచున్నను,

చ॥ తనయులులేని ధామమును, దైవనివాసములేని గ్రామముల్,
వినయములేని విద్యయును, వివేకముమాలినయట్టి వైద్యముల్,
జనపతిలేని రాజ్యమును, సౌఖ్యవిరోధకమైన భోజ్యముల్, గన
కములేని భాగ్యమును. సుగంధములేని సుమంబువ్యర్థముల్ ॥

అన్నట్లు యీభోగంబులన్నియు వృథాయనియు, (అపుత్రస్య గతిర్నాస్తిః) అను నార్యోక్తిననుసరించి ముందుపరమందు సహా నాకు గతులులేవనియు విచారించుచుంటిమి. యింతలో మాపూర్వజన్మసుకృతం ఈ నారదరూపకముగా నాకు ప్రత్యక్షమాయె, ఇంక నా విచారముతీరు యోచన చెప్పుదురని ఆశగలుగుచున్నది గాన నాకు సుతులుగలుగు యోచన చెప్పి మమ్ములకృతార్థుల చేయుము, మహాత్మ నారదమునీంద్ర.

నార—రాజేంద్రా! మానవుండు ఏకోరికతో భగవంతుని ప్రార్థించునో ఆ కోరికదీర్చెదనని ఆ వైకుంఠవాసుడు కంకణముగట్టుకొనియున్న వాడు ఇంక భక్తులకోరిక దీరుటొకదుర్లభమా? ఆ మహాసీయునిగూర్చి మీరు దంపతులిద్దరు తపంబాచరింపుడు తప్పక ఆ మహాసీయుండు మీకు సంతానంబీయగలండు, రాజా తడవాయె వెళ్లెదను బ్రంహ్మానభకుబోయి రావలయు అని వెళ్లును.

ప్రభావతి—నాథా! వింటివా మునిసింహునివాఖ్యంబులు నాథా మనము తప్పక తపంబాచరింపవలసినదే, మీరు రాచకార్యంబులన్నియు నేడే మనమంత్రి స్వాధీనముచేయుము, రేపేమనము అరణ్యప్రయాణము చేయుటకు మంచి ముహూర్తము. మనోహరా ఇంక అలసించిన ప్రయోజనము లేదు, తప్పక వెళ్లవలయును.

రాజు—మంత్రీ విశారదా.

మంత్రీ—చిత్తము మహాప్రభో.

రాజు—మంత్రి! నేను సంతానములేని కొరంతచే విచారింపుచుండగా దేవఋషి నారదులవారు విజయంచేసి రాజేంద్రా! శ్రీ విష్ణుమూర్తిని గురించి దంపతీయుక్తముగా తపంబాచరించిన సంతానముగలుగునని ఖండితముగా చెప్పిపోయినాడు, నేను తపమాచరించి లబ్ధసంతానుండనై తిరుగావచ్చువరకు యీ రాజ్యమునకు సర్వాధికారివై న్యాయముగా రాజ్యపాలనంబొనర్చుచుండుము.ఇదియే నాశిక్షావుంగరముచేకొను మంత్రివరా.

మంత్రి—చిత్తము తమయాజ్ఞ శిరసావహించి వర్తించెద రాజేంద్రా

రాజు. దరువు ఏకతాళం.

విను మంత్రీవరా! తెలిపెద ॥ పల్లవి ॥

రైతులవల్లను మితమైనపన్నుగొని రక్షించే భారము రాజు దెల్లప్పుడు ॥ విను ॥ ప్రజలను తనయొక్కబిడ్డలమాదిరి కరుణతోజూచిన ఘనకీర్తి గల్గును ॥ విను ॥ దేవబ్రంహ్మణులకు హానిచేయబోకు తప్పదెప్పటికిముప్పు ముమ్మాటికి ॥ విను ॥ ఇలయందు కటకానిపలెయందు నెలకొన్న శ్రీ రామచంద్రునిచేరి వేడుచుండుూ ॥ విను ॥

వ॥ మంత్రీ మనసేవకులయందు కఠినస్వభావము చూపరాదు, మహా దరణ్యములయందు తపంబుజేయు ఋషీశ్వరులకు హానిచేయు దుష్టమృగంబుల వేటాడుచుండవలయును, దుష్టశిక్షణశిష్టపరిపాలనే రాజులకు ముఖ్య లక్షణము, విచారణలందు న్యాయమైనవృత్తాన్తములు పాలింపుచుండుము, మన సామంతరాజులందరియొద్ద కప్పంబులు సక్రమముగా వసూలుచేయు చుండుము, మంత్రివరా!

మంత్రి—చిత్తము రాజేంద్రా॥

రాజుప్రభావతులు. అరణ్యప్రయాణం.

రగడ॥ కాననంబులకును వారు కదిలిరి వేగమునా బెబ్బులులు వెలుగులు బొబ్బమెకంబులు, కస్తురిమృగములు, ఖడ్గశరభములు, గండకభగము లు, కొండగొరనుకులు, సారంగంబులుగారెను బోతులునడవిపందులును హయచయంబులును, నక్కలరణ్యపుకుక్కలు దుప్పులు జెవులపోతులును జె లగుబాతులును, కోతులగుములును, కొండముచ్చులును, దాసరిపాములు నూ నరవెల్లులు పెనుశివంగులును బునుగుబిల్లులును నుడుములు మిడుత లు నుడుతలు నెలుకలు ఘూకచయంబులుగా కలగుంపులు మొదలగు మృ గములు సకమలపక్షులు భూతగణంబులు ఫేరాశంబులు బ్రంహ్మరాక్షసు లు పై పై నార్చుచు తిరుగుచు జనులకుఘోరరాకుండెడి కాననంబులకును వారు కదిలిరి వేగముగా॥

రాజు. దరువు. అటతాళము.

కాంతా వినుమా యీ వనమూనుకలయగనుగొనుమా ॥ పల్లవి ॥ చం పకపున్నాగ చామంతివృక్షముల ఇంపు గుల్కెడి కోవెలమొత్తములతో డా ॥ కాంతా ॥ మల్లెలుమొల్లలు మంచి సంపెంగాలు కొల్లగాగలవిచట కోరిననటులా ॥ కాంతా ॥ మణులు స్థాపించిన సౌపానములుగలుగు మందీ రంబులు జూడుమా ॥ కాంతా ॥ ఆ మందిరంబులకును యిందూని బోలిన మానిక్యములు జూడుమా ॥ కాంతా ॥ ధరణిలో కటకానిపల్లెపురమునం దు వెలశియున్న శ్రీరామామనోహరుండు కోరికలన్నొసగుచుండు॥కాంతా॥

వ॥ అహా కాంతామణీ వజ్రములు దాపిన పచ్చరాతిసోపానంబు లుగ

లిగిన మంచినీటి సరస్సులెన్నియో యీ వనంబున లెక్కకు మి
క్కుటంబుగా నున్నవి ఆహారంబున నుపయోగించు ఫలవృక్షంబు
లుగలిగి మనంబునకుల్లాసంబు గలిగించు యీ వనరాజంబు మన
తపోనిష్ఠకు మిగుల ననుకూలంబుగా నున్నదిగదా ? తలోదరీ ॥

ప్రభా—చిత్తము నాథా.

॥ రాజదంపతులు తపోష్టలోనుండుట ॥

శా॥ అరయన్ శంతనుపుత్త్రుపై విదురుపై నక్రూరుపై గుబ్జపై నరుపై
ద్రౌపదిపై కుచేలుపయిన్ నందవ్రజశ్రేణిపై బరగన్ గల్గు భవ
త్కృపారసము మాపై గొంతరానిమ్ము నీ చరణాబ్జంబులు నమ్మినా
ము జగదీశా కృష్ణభక్తప్రియా ॥

ఉ॥ ఎన్నటిబాంధవుండు ధ్రువుడెన్నటి చుట్ట మహల్య కుబ్జ మీకెన్నటి
యిష్టురాలిభక్తులేశ్వరుడెన్నటి భృత్యుడిట్టి మీ యున్నత సత్కృ
పాగరిమ నెంచిన కారణబాంధవుండవై మన్ననఁ బ్రోచు నీ కరుణ
మా తరమే నుతియింప నచ్యుతా ॥

కం॥ వన్నెలుగల పచ్చడమట
క్రొన్ననవిలుకాడు ముద్దుకొడుకటవడకున్
వెన్నెలకిరణటకన్నులు
వెన్నుడవటనీకు సవతు వేల్పు వేరీ॥ రుక్మ

సీ॥ డాచంకవేత్రదండము కోడ బంగా । రుజలజాత భృంగారమలవ
రించి॥ మొలపట్టుకాశలో మురళికానాళంబు । బొనిపి బిగ్గరదిం
డు పెసచికట్టి॥ దధిమిశ్రితంబైన ధవళాన్నకబళంబు । సవ్యహస్త
మునందు సంతరించి॥ రత్నాంగుళీయక ప్రభగనర్చిన వేళ్ల । సం
దినొక్కక వడపిండెయునిచి ॥ గీ॥ గోపసుతులనడుమ గూర్చుం
డినవ్వుచు । నఖిలయాగభోగివైతనర్చు । దేవ నీవు చద్దిత్రిగనుల
నోరూర । నారగించులీలలభినుతింతు॥

రాజు. కీర్తన. దరువు. రూపకం.

హా రమాపతే బ్రోవరా ॥ హా రమాపతే ॥ సుతులులేకున్న మాకు గతు

లు లేవనూచుజెప్ప గతినీవ్వన్నావటంచు మది నెంచితిమయ్యారామ ॥ హా ॥ మమ్ము నీవ్వుడు బ్రోవకున్న మిమ్ము వీడగజాలమయ్య నమ్మితిగా సుతుల నిచ్చిపొమ్మన్నను బోయెదము ॥ హా ॥ పగవాని తమ్ముడొచ్చి వగజెంది మ్రొక్కగానే అగణితముగ వాని నీవు తెగువతో రక్షించలేదా ॥ హా ॥ గతులకొరకు వేడుమమ్ము మదిలోదయయుంచి వచ్చి సుతులనిచ్చి బ్రోవ వయ్య బ్రతికినన్నినాళ్లు గొల్తు ॥ మోర ॥ యిలయందు వెలుదండకులజు డాలసుబ్బయార్య సలలితముగ బ్రోచు కటకానపలిపురీశ పాపనాశ ॥ హా ॥

సంధి—ఇట్లు రాజదంపతులు నిద్రాహారంబులుమాని కందమూల ఫలాశనులై శతసంవత్సర పరిమిత కాలంబు తపంబుగావించి నంత పరమద యాళుడై, విష్ణు ॥ కీర్తన ॥ ఆదితాళం.

ప్రత్యక్షమాయనపుడు శ్రీవిష్ణుమూర్తి ॥ ప్ర ॥ ప్రత్యక్షమాయనపుడు బ్రహ్మ తేజునికోర్కె బాగుగదీర్తు ననుచు బ్రంహ్మాదులెల్లబొగడ ॥ ప్ర ॥ రాజాదంపతుల నిష్ఠరయమూన మేచ్చుకొనుచు వేడుకతోడ తగిన వర ములిచ్చెదనని ॥ ప్రత్య ॥ ఇలను కటకానిపల్లె పురమూన వెలశిన వెలుదండ పెద్దసుబ్బయ వినతుడైనట్టి స్వామి ॥ ప్ర ॥

విష్ణు—జీహాహా బృహత్సేనదంపతులారా లెండు మీ తపంబునకు సంతసించితి మీ కిష్టంబగు వరంబులిచ్చెద కోరుము లెమ్ము రాజేంద్రా అని చేతిపట్టును.

సంది—యింతలో రాజదంపతులు కన్నులు తెరచి,

కం॥ వందనములో పరాత్పర ।
వందనమిదె వాసుదేవ వరగుణసాంద్రా ।
వందనముదీనరక్షక వందనములు జేతుమిపుడు వందలువేలు ॥

విష్ణు—రాజేంద్రా! ఏల యిట్లు ఘోరతపంబాచరింపుచుంటివి చెప్పుము నీ కోరికదీర్చెద కోరుము.

రాజు—మహాత్మా

సీ॥ కులవర్ధనుండగు కొడుకుగాననియట్టి లాఘవాస్పదుని యాలయము లయము ॥ సిసులస్పంనాడపైన వరసుతుబడయని ॥ ఘనకలు

మాత్మ జీవనము వనము। పితృకుల ధురీణముదీర్పడు సూనుశేం
దని దౌర్భాగ్యశీలు గోత్రమ్ము త్రమ్ము॥ రహిని హావరసుఖప్రదసు
పుత్త్ర సంతతిని వరపుణ్యపోషభవమ్ము వమ్ము। గీ। పలుబలుకు లే
ల నిఖిలమ్ము ఖలముహూవె। యాత్మజులు లేని వారికోయయ్య వి
నుము। తర మెయున పత్ర్యాప్తి వర్ణ్యమరయ నలని యఖిలమును ని
ట్లు ముఖవర్ల హానిజెందు॥

వ॥ గావున మహాత్మా నన్నట్టి దుఃఖవముద్రం బునన్ ముంపకసుతోల
గాంచునట్టి భాగ్యంబొనగూర్చి రక్షింపుము తండ్రీ మహానుభావ.

విష్ణు—రాజేంద్రా! నీకు పుత్రసంతానము గలుగదు గాని నన్ను సం
తసింపజేయు నొక్క బాలికారత్నంబు గలుగును, అకన్యకామణివల్ల నీ
కు మహావరసుఖమ్ములును, వంశపావనమును గలుగును, నాస చింతను
బాసి సుఖంబుగా రాజ్యపాలనంబు జేయుము రాజేంద్రా.

(అని అంతర్ధానమగుచున్నాడు.)

రాజు క॥ వ్యాప్తం జెందక నగవక।
ప్రాప్తంబగు లేశమయిన పదివేలనుచున్।
దృష్టంబలందని మనుజుడు।
సప్తద్వీపములనైన జక్కంబడునే॥ భాగ॥

అన్నట్లు కాంతామణి మనకు ప్రాప్తంబున్నంతవరకు భగవంతుండను
గ్రహించినాడు చింతించి ప్రయోజనంలేదు తక్కువనోమునోమి ఎక్కువ
ఫలము రమ్మన్న వచ్చునా?

ప్రభా—చిత్తము.

నంది—ఇట్లు రాజదంపతులు పురప్రవేశంబొనర్చి రాజ్యపాలనంబు జే
యుచుకొంతకాలము సుఖంబుండునంత భగవదనుగ్రహంబుచే ప్రభావతి॥

సీ॥ తనుమధ్యయనుమాట దప్పింపగాబోలు
బోరలేక నడుములు పొడలచొచ్చె
కుచములు బంగారు కుండలోయనుమాట
కల్లగా నగ్రముల్ నల్లనయ్యె.

చంద్రాస్యలనుమాట సరవిమాన్పగఁబోలు
గోల విలాసంమ్ము పలుచనయ్యె
సుందరులనుమాట సందియంబుగఁబోలు
గర్భభారమ్ములఁ గాంతిదప్పె.

తే॥ ననుచుగనుఁగొన్నవారెల్ల నాడుచుండ
గట్టుచీరెల వేకిఁబుట్టుచుండ
నాసతినిజూచి యందరు నలరుచుండ
కాంతకును నష్టి గర్భంబుగానుపించె॥

వ॥ ఇట్లు పూర్ణగర్భిణియైయున్న, నిజదారంగాంచి బృహత్సేనుండు ఎప్పుడెప్పుడు తిన భార్యయందు పుత్రికాజననంబగునో యని యువ్విళ్లూరుచుండ నవమాసంబులు పూర్తియగుటయు ప్రభావతి ప్రసవవేదన బడుచుండెనటా యటులవలెనూ॥

అంత ప్రభావతి ప్రసవవేదనతో. ప్రవేశము.

ప్రభా॥ కీర్తన. దరువు. ఆటతాళం.

తాళగజాల యీబాధాకు॥ తాలా ॥ తాలాగజాలాను బాలామణులార జాలామేలమీాకు నీలావేణులార॥ తాలా ॥ నిన్నాటినుండియు నన్నుఁ గాంగులార పన్నాగశయనుఁకు నన్నుబ్రోవడాయె॥ తాలా ॥ యీలాటి బాధనుచు మేలాగదెలిసీ తె అలాగుఘోరతపము యేలాజేయుదుమమ్మ ॥ తాలా ॥ ఈగండామీాజేరిన కొండమీాదవున్న దండిమారెమ్మకు గండదీపము మోతు॥ తాలా ॥ ఇలయందు కటకాని పలెయందు నెలకొన్న బాలా గోపాలుడే పాలించవలయు॥ తాలా ॥

అమ్మా చలికత్తియలారా యీబాధకు నేనోర్వగజాల గాన తగిన మంత్రసాని యవరైనవున్నయడల విచారించి పిలిపించుడి తల్లులారా॥

అంతట చలికత్తియలు మంత్రసానినిపిలుచుట చింతానాగమ్మ యను మంత్రసానిచెప్పినలతో ప్రవేశించుచున్నది.

ప్రభావతి మంచికాలమందు కన్యకారత్నంబును ప్రసూతిఅయినది.

ప్రభా — అమ్మా చలికత్తియలార యీశుభవర్తమానము రాజుగారి

కి తెలియపరచండి త్వరగారా.

చెలులు॥ చిత్తము.

చెలులు—రాజేంద్రా పదివేలవందనంబులు మహాత్మ యీదినం సూర్యోదయానంతరం పదిఘడియలకు ప్రభావతీదేవిగారు ఆడశిశువున్ప్రసూతిఅయినది.

రాజు— ఆహా పరంధాముని వాక్యంబులు తప్పునా। ఒరే భటులార మీరు తక్షణంవెళ్లి మనపురోహితులను పిల్చుకొని వారికీ శుభవర్తమానంచెప్పి తీసుకొనిరాండి భటులార॥

భటు— ఆహా చిత్తము రాజేంద్రా॥

అయ్యా విప్రోత్తములారా ప్రభావతీదేవి గారు ఈవుదయం ఆడశిశువును ప్రసూతిఅయినది జన్మనక్షత్రం వగైరాలుచూచి శుభాశుభములు నిరూపించుటకుగాను రాజగారుమిమ్ములను పిల్చుకరమ్మన్నారు గాన దయచేయండి స్వామీ॥

పిచ్చిబొట్లు—ఒరేసుబ్బావధానీ రారా మన రోజులు పండినవి లేకలేక మన రాజుగారింట్లో పుత్రికామహోత్సవము అయినది. భూదానమ్ము. గోదానమ్ము, కన్యాదానములు, సువర్ణదానములు మన దరిద్రవిచ్ఛిత్తు అగునట్లు చిక్కును.

సుబ్బావధాని—కక్కునాయినగారూ రాజుగారు మనమేకోరిన అది ఇచ్చునా!

పిచ్చి—ఏమి కోరదల్చుకున్నావురా? యేదో గొప్ప యెత్తుపెట్టుకున్నావే! యవరికి యేగుపెట్టినావురా?

సుబ్బా—యేమి లేదు కక్కునాయినగారు తీగవేట్లో కొంచం భూమి నాతోట్లో కలుస్తుంది అది పట్టాకుయిస్తారా.

పిచ్చి—రాజుగారు మనసుబట్టిన ఆది ఒక లెక్కా!

సుబ్బా—ఇంకొక్కటి వున్నది కక్కునాయినగారూ.

పిచ్చి—అదియేమిరో! యింకా యేదోపెడుతున్నావే?

సుబ్బా—ఒక వర్తకుడికి నాకు కొన్నిభూముల విషయంలో చాలా వ్యవ హారమున్నది, అందులో వారిసహాయ్యం కావలశియున్నది.

పిచ్చి—అభూములసంభంధమేగదా! యిదివర్కు మేస్ట్రీటువ్యవహారం స హాజరిగియున్నదిగదా?

సుబ్బా-అవును కక్కునాయినగారు?

పిచ్చి—ఆవ్యవహారంలో వారిదయయిప్పుడు క్రొత్తగా సంపాదించవక్క రలేదు యిదివర్కు వారి అంతఃకరుణ యున్నందువల్లనే మేస్ట్రీటు దావాలోవర్తకునివల్లనీకు రు. 20-0-0లు పరిహారం యిప్పించడ మున్ను ఆదావాదాఖలా భూములన్నియు సాగుచేస్కొని నీవుదొ బ్బితినడము లేకున్నవాడు సామాన్యడా! అబ్బో నిన్నుబ్రతుకని చ్చినా!

సుబ్బా—కక్కునాయినగారు వాస్తవమేగాని మనము త్వరగాపోదాము పాండీ రాజుగారు కోపముచేయుదురేమో.

పిచ్చి—పంచాంగము పట్టుకొచ్చావా?

సుబ్బా—ఇదియే సంవత్సరం కక్కునాయినగారు.

పిచ్చి—ఇదియా! తారణసంవత్సరం వెళ్లగా క్రోధి క్రోధి వెళ్లగా సా దారణ సాదారణ వెళ్లగా ప్రభవ సంవత్సరం గదరా!

సుబ్బా—జీహా కక్కునాయినగారు తమకు సంవత్సరంలపేర్లు వహా వరు సగా రాకున్నను యీా సంవత్సరం ప్రభవ సంవత్సరం అని గు ర్తుగా చెప్పినారే!

పిచ్చి—గుర్తా బండలా మావాడు అంతంటేవిన్నార?

సుబ్బా-అట్ల అయితేరాజుగారు పిలిపించేపని మనయిద్దరివల్లకానట్లే ఎట్లా గతి.

పిచ్చి—దానికేమిపత్వాలేదు మనలనురాజుగారు ఎంతవర్కు అడుగుదురో అంతవర్కు నేను యిదివరకే పూర్తి విచారించుకొని వ్రాయించి పెట్టినాను.

సుబ్బా-సరే అట్లయిన పోదాముపాండీ కక్కునాయ్నగారు.

పిచ్చి—పంచాంగం పట్టుకొచ్చావా?

సుబ్బా-క్రోధనసంవత్సరం బాబతు పాతపంచాంగంపుంజీ తెస్తున్నాను.

పిచ్చి—పాతదెందుకురా భ్రష్టా.

సుబ్బా—రాజుగారికి చెప్పవలశిన సంగతులు మీరు వ్రాయించినారని చెప్పితిరిగదా! పంచాంగం కొత్తదైనను పాతదైనను అంతకష్టము లేదుగదాయని పాతదే తెచ్చినాను కక్కునాయినగారు.

పిచ్చి—అట్లయిన సరే రా పోదము.

సుబ్బా॥ పిచ్చి॥ ఈవిధముగా మాట్లాడుకుంటూ కొలువుకూటము చేరుదురు వేదము చదువుచుందురు.

రాజు క॥ చనుదెంచిన భూసురులకు।
గనుగొని భయసంభ్రమములు గడలుకొనంగా।
వినయమున నెమరుగాజని।
జననాథుడు విప్రులకును జయ్యనమ్రొక్కె॥

సీ॥ ఆరోగ్యమస్తు దీర్ఘాయురస్తు యశోస్తు శ్రీరస్తు సంకల్పసిద్ధిరస్తు హరిభక్తిరస్తు సుస్థిరతాస్తు మహిమాస్తు విప్రప్రసాదోస్తు విక్రమోస్తు విఖ్యాతిరస్తు దిగ్విజయోస్తు సామ్రాజ్యమస్తు బోధోస్తు కల్యాణమస్తు విభవోస్తు సస్యాభివృద్ధిరస్తు దయోస్తు దానశీలోస్తు సత్కాంతిరస్తు.

గీ॥ ధనకనకవస్తు వాహనధాన్యపుత్ర।
పౌత్రలాభోస్తు నిత్యసౌభాగ్యమస్తు
ప్రతిభటాగణ్యతోస్తు భూపాలన్యాయ
శక్తిరస్తు సదైవ తేజనవరేణ్యా॥

రాజు—అయ్యా! విప్రోత్తములారా! యీ దినం సూర్యోదయానంతరం గంఘడియలమీదట నాభార్య ఆడశిశువును ప్రసూతి అయినది గనుక ఫలములు నిర్ణయించండి స్వామీ.

విప్రో—పంచాగంబువిప్పినట్లున్ను, ఘడియలు లెక్కించినట్లున్ను నటింపుచూ రాజేంద్రా! యీ అమ్మాయి మహా లక్షణవంతురాలు, జన్మన క్షత్రం వగయిరాలు చాలా మంచివి, మాసము చైత్రమాసం పక్షం శుక్లపక్షం, తిథి నవమి, వారము శుక్రవారం, నక్షత్రం వుత్తరాషాఢలగ్నం మిథునలగ్నం గాన యీమె జన్మనక్షత్రము నకు అయిదు గ్రహములు వుచ్ఛస్థితియందున్నవి గనుక యీమె ఒక మహాత్మునకు భార్యకాగలదు ప్రపంచంబున మెన్నిమంచి లక్షణంబులుండునో అన్ని లక్షణంబులు మన అమ్మాయియందు గన్పట్టుచున్నవి గనుక రాజేంద్రా యీ అమ్మాయికి లక్షణాదేవి యను నామకరణంబొసంగుడు.

రాజు—చిత్తము.

సంధి॥ అంతట లక్షణాదేవి చెలికత్తెయలచే గారాబంబుగా పెంచు చుండగా లక్షణాదేవి శుక్లపక్షచంద్రునిభాతి దినదినప్రవర్ధమానయై పె రుగుచుండ పన్నెండువత్సరంబులు పూర్తియైన ॥

ప్రభావతి—నాథా మనకూతురగు లక్షణాదేవికి యుక్తవయస్సువచ్చియు న్నది గన్క తగినరాకుమారుని విచారించియున్నారా నాథా వివాహమునకు పకాలమువచ్చియున్నది ఆలసించుట ధర్మవి రుద్ధము.

రాజు—కాంతామణీ నేనున్ను అదేప్రయత్నంబులోయున్నాడ,

లక్షణ. దరువు. ఆదితాళం.

లక్షణాభామ తరలివచ్చేను ॥వర॥ లక్షణా ॥ పద్మాక్షి యాహాయ టంచు పండితులలరగామది ॥ లక్షణా ॥ తొల్కారిమెరుపులోని తళ్కున ॥యాతొల్క॥ యాచిల్కారాతునిచేతి చిల్కా యీచిన్నదీయన॥ లక్షణా ॥ ఇలనూ కటకానివల్లయీశుడో ॥ యీఇల ॥ శ్రీ వెలుగండ పెద్దసుబ్బయ వినుతూని స్మరణజేయుచు॥ లక్ష ॥

కం॥ జలకంబాడియు జల్తరు
వలువధరించియు సువర్ణవస్తువులెల్లన్

పొలుపొందఁదాల్చియును లల
నలతో వేంచేసె లక్షణాకోమలియున్ ।

వ॥ ఇట్లు వచ్చి కొలువుకూటంబున మాటలాడుచున్న తల్లిదండ్రులం
గాంచి,

లక్షణ క॥ వందనమిదె తండ్రీ జన ।
వందిత భూజన వినోదివర కవిమిత్రా ।
వందనము దీనరక్షక ।
వందనములు గొనుము సత్యవర్తన సుగుణా ॥
తండ్రీ పదివేల వందనంబులాచరించెద.

రాజు—దీర్ఘాయురస్తు సుమంగలీభవ.

క॥ వర్ధిల్లుము వరగుణవతి ।
వర్ధిల్లుము దివ్యగాత్రి వారిజనేత్రీ ।
వర్ధిల్లుము సుచరిత్రీ ।
వర్ధిల్లుము నాదుపుత్రి వర్ధిల్లుముతగన్ ॥

అమ్మా! పుత్రికారత్నమా యే కారణంబున ఈ సభకరుదెంచితి
వి తల్లీ.

లక్షణ—జనకా నాసఖులఁగూడి మనయుద్యానవనంబునకేగి అచ్చటన్
గలవేడుకలెల్లం గాంచి మనోరంజనార్ధంబుగా గానంబుచే ప్రొ
ద్దుబుచ్చుకొని మదికింపుగలిగించు ఫలపుష్పంబులు సంగ్రహిం
చుకొనిరావలయునని కోరికగలిగి తమయాజ్ఞపొంది పోవలయు
నని యిచ్చటికిన్ వొచ్చితిని గాన శలవిచ్చిపంపుముతండ్రీ ॥

సంధి॥ నారదుండొచ్చు విధంబెట్లనినం?

నారదుడు కీర్తన ఆది తాళం.

వందానమిదిగో శ్రీ గోవిందమాధావా ॥నా వందా॥ సుందరాకార
సత్యానంద కేశవా ॥ వందా ॥ నందీవాహనవినుత నందాత్మజాపా మౌని
బృందాసేవిత నంద నందా నా గోవిందా ॥ వందా ॥ ఖండన విజయోద్దం

దనిసాచర ఖండనహారి భూమండలేంద్రనుత ధరణిపాదపా ఖండలస్తోత్ర
చినుండు నాదుమొర నింపుకయును మార్తాండతేజ బ్రహ్మాండమూర్తి
వరదుండవీవు ॥ నా వందా ॥ పారధని భగంభీర పరాక్రమ భూరిసద్గుణ వి
హారపరాత్పర రార నిన్ను మదికోరిభజించెవ ధారుణి శ్రీ వెలుదండ చి
న్నసుబ్బారావున కాధారమైన సువిచారబ్రోవుమోశ్రీరమణా ॥ నావందా ॥

రాజు—మంత్రీ విశారదా యెవరో నొకమహానుభావుండు మనసభాస్థలి
కేతెంచుచున్నారు నిదానించి జూడు బ్రహ్మ మానసపుత్రుం
డగు నారదులవారే।

మంత్రి—చిత్తము రాజేంద్రా మనమెదురేగి వారినితోడ్కొనిపోవుట మంచిది.
రాజు— మంత్రీ అటులనేబోవుదము పద అని యెదురేగి
రాజు॥ మంత్రి—మహాత్మా నారదమునీంద్రా పదివేలనమస్కారంబులాచరిం
చెదము.

నారదుడు—రాజేంద్రా దీర్ఘాయుష్మంతులై వర్ధిల్లుడు.
రాజు—మునీంద్రా యీసింహాసనంబలంకరింపుడు.
నార—అటులనే కూర్చుండెద మీరును కూర్చుండుడు.

సంధి, అందరును కూర్చుందురు.

రాజు—నారదమునీంద్రా తమరాకచే నాగృహమును దర్శనంబున నాజన్మ
యుసార్థకమైనవి తమరు యెచ్చటినుండివచ్చితిరి! యేయేచిత్రం
బులుగాంచివచ్చితిరి యీశిష్యుండు గావించవలసిన కార్యంబేమ
యినాగలదా?

నారదుడు—రాజేంద్రా! స్వర్గపట్టణమునుండి వచ్చితి విశేషంబులు యే
మియులేవు మార్గమధ్యంబున నున్నందున చూచిపోవలయు
ననియే వచ్చితి.

నారదుడు కీర్తన కన్నడ రూపకం.

దేవకితనయా గోవిందా గోపికప్రియ ॥ దేవ ॥ రామాగుణధామా ర
ణభీమా ఘనశ్యామా ॥ దేవ ॥ ధారుణి వెలుగండ పెద సుబ్బారావును పా

జనకులు సమ్మతింతురా! వారు సమ్మతించకున్న నిష్టపురుషుడు లభింపని చ్చునా! గాన నేనేమిసేయుదు నేనాతనిభార్యనై సుఖించు భాగ్యంబున్న దో లేదో అటుగాకున్న యీశరీరంబువిడిచెదగాక. గాని వారల పెండ్లాడకు న్న నేను జీవించుటయెట్లు అస్వాధీనత్వము వహించి కొంతకాలమందు జరుగు ప్రసంగములువినుచుంటి।

నారదుడు—రాజేంద్రా యీ అమ్మాయిఎవరు.

రాజు—మునీంద్రా విష్ణుమూర్తి అనుగ్రహంవల్ల నాకుగలిగిన కన్యకార త్నముగదా యీమె.

నార—ఓహో అటులనా యింతలక్షణవంతురాలు ఎవరోనని యోచింపు చుంటిని ఆమహాత్ముప్రసాదమే నామహాలక్షణవంతురాలు రా జేంద్రా.

రాజు—తమబోటి పెద్దల ఆశీర్వచనముగదా! మహాత్మ.

నార—రాజేంద్రా! యీమెకు వివాహమయ్యెనా?

బృహత్సేనుడు—వివాహము చేయులేదు మునీంద్రా!

నార—అట్లైన విచారించి తగిన రాకొమరున కిచ్చి వైవాహికంబు త్వరగా చేయుము రాజేంద్రా! మాబోటివారికింత ఆహారము చిక్కును గన్క చెప్పుచున్నాడను.

బృహ—మునీంద్రా! తగిన రాకొమరుడు చిక్కనందున యింత కాలము వేచియుంటిని తాము త్రిలోకసంచారులు గదా! ఎచ్చటనైనా నా మన అమ్మాయిని పెండ్లాడతగిన రాకొమరుండుండిన దయయుంచి న తెల్పిన యిప్పుడే పిలిపించి తమయిష్టప్రకారము వైవాహికము గావించెద మహాత్మా.

నార—నీ మనంబున కోరినవారి కిచ్చిన బాగుండును గాని నా యిష్టమున న నాకిష్టమయిన పురుషుడు నీకిష్టముగ నుండునో లేదో రా జేంద్రా.

క॥ మునివరులమైన మాకో।
ప్పిన పురుషుడు నీకు చూడ వేడుక లేదో।
వినుపించెద విను మాలెదు।

ఘమడందురు నిల్లవారు హృత్కల నాథా॥

కం॥ ఆతండీతరుణీమణి
కరికినవాడంచు మోగమందెగమదిలో
క్షితినాథా ద్వారకపురి
సతతము నేతెమ్మనుచు సత్యముస్వామీ॥

రాజు—ఓహో శ్రీకృష్ణునా! మహాత్మా నేను చంద్రవంశమునజనియించిన వృత్తమక్షత్రియుండనై గొల్లనికిపుత్రినిచ్చిన కులంబునకు హానియు పరివారుహాస్యముచేయుటయు లోకులు నిందించుటయు కలుగదా! మహాత్మా.

నార—రాజేంద్రా నీవెంత అవమానమునకెవ్వ అంగుళైన నీకు నిన గతిచెప్పెదనా! ఆమహాత్ముని గాధ నీకేమి తెలియనట్లున్నది వారిచరిత్ర మహాదివ్యమై ఆఘుహరింపజేయులరాజు.

రాజు—మునీంద్రా ఆశ్రీకృష్ణుని చారిత్రమువిస్తారంబుగా నాకెరింగించి నామనంబునందుండు కోర తీర్చిన నేధన్యుండనయ్యెద మహాత్మా

నార—వత్స రాజేంద్రా పూర్వకాలంబున కంస నరకాసుర ధేనుకాసుర బకాసుర దుర్యోధన జరాసంధ మొదలగు దుష్టరాక్షసులు ప్రబలి సంచరింపుచుండగా భూదేవి దుర్మార్గుల భారముసహింపజాలక ఒకనాడు స్వర్గపురమునకుచేరి దేవేంద్రునితో మొరపెట్టుకొ నెను అప్పుడు ఇంద్రుడు భూదేవితో అమ్మా యిట్టిదుర్మార్గుల బాధమాన్పుటకు నాతరముగాదు నేనున్నా వారిబాధ సహింపలేక పట్టణముమాని అడవులయందు సంచరింపుచున్నాను మనబాధదీర్చుటకు ఆవైకుంఠవాసుడే శక్తిపరుడనిచెప్పి ముప్పదిమూడుకోట్లదేవతలతో భూదేవినిదోడ్కొని వైకుంఠపురంబుజేరి శ్రీమన్నారాయణమూర్తిని స్తోత్రముజేయుగా అంతట విష్ణుండు కృష్ణుండన చరసాలయందుంచబడ్డ కంసునిచలియలగు దేవకిగర్భమందుద్భవించి అచ్చియుండ్ని కంసుడేమి కీడుతలంచునోయని తనమహాత్మ్యంబున చెరసాలయు యమునానదియు అర్ధరాత్రంబున జనులెరుంగకుండ గడచి అచ్చట యశోదయను గోపకాంతిగర్భమందు అప్పుడుతన ఆజ్ఞమేరకు యోగమాయ జన్మించియుండగా ఇతరులకు తెలియనీయక తానా బాలింతప్రక్క

న మానవబాలునివిధంబుగానుండి అచ్చటజన్మించిన యోగమాయయను
మాయాకన్యను చెరసాలయందుండు తనతల్లి దేవకిప్రక్కను యుంచియుం
డగా చంపగలందులకు కంసుడాకన్యను ఎగురవేయగా ఆకాంశమునంటనిల్చి
దుర్మార్గుడా కంసానిన్నుజంపువాడు బాలుడై రేపల్లెయందు పెరుగుచు
న్నాడనిచెప్పి ఆదేవి అదృశ్యురాలైపోయిన అనంతరమందు కృష్ణునిజాడకను
గొని కృష్ణునిజంపుటకుగాను కంసునివలన బంపబడిన పూతన శకటాసుర
తృణావర్త మొదలగు క్రూరరాక్షసులనెల్ల గీటడంచి తదనంతరమందు న
రకాసుర వృషభాసుర ప్రలంభాసుర హిడింబాసుర బకాసుర కాలయవ
న జరాసంధ శిశుపాల దంతవక్త్ర దుర్యోధన యిత్యాదిమహా దుర్మార్గు
లందరిని స్వహస్త పరహస్తములచేతను చంపించి దేవతలనెల్లరక్షించి యి
ప్పుడు ద్వారకానగరంబును పాలింపుచుండు మహాత్ముండు యీకృష్ణుం
డేగదా! రాజేంద్రా కృష్ణునిగొల్లవాడనదవేల?

రాజు—మహాత్మా! ధన్యోస్మి, ధన్యోస్మి, మహానుభావ శ్రీ కృష్ణునిచరి
త్ర యింత అపూర్వమని నేనెన్నడు కని విని యెరుంగ నా జన్మపా
వనంబయ్యె నా పుత్రినిచ్చిన ఆ మహానుభావునకే యివ్వవలయు
ను గాన యీ నైవాహికంబు అటంక దూష్యములపాలు గాకుం
డునట్లు [illegible] వేరు యోచన దెల్పు మహాత్మా॥

నారదుడు దరువు రూపకం తాళం.

భూపవర్య వినుము కృష్ణమూర్తి నెన్నగా ఆపద్బాంధవుడదియుగాక
రూపవంతుడు ॥ భూ ॥ మదనాకారుడతని సాటివెదకిచూచినా పదునాల్గు
లోకముల లేరు పలుకూలేటికి ॥ భూ ॥ భూమిని కటకానివల్లె ధామమాన్యైన
యా స్వామికిచ్చి నీ పుత్రిని నలుపూపెండిలి ॥ భూ ॥

క॥ ఆ పుణ్యుండగు కృష్ణుం
డీ పణతికి తగిన జోడుయే నెరుగుము నీ।
పల్లెనొక తహస్యము।
భూపా త్వరితముగ దెలుప బుద్ధి బోడమెదుర్

కం॥ గొల్లండని గోపాలుని
నెల్లజనుల్ బలుకుచుందురే భూమిని భూ

వల్లభయానిందకు శ్రీ
వల్లభుడరుహుండుగాడు వాస్తవ్యముగాన్ ॥

వ॥ రాజేంద్రా నీకుమార్తెకు స్వయంవరముహూర్తం నిశ్చయంచేసి ఆపంగతి నెల్లరకు తెలియునట్లు దేశంబులయందు చాటింపుజేయించితి వేని.

గీ॥ నీకుమారితనువరించి నిఖలధారు । ణీపతులువత్తురప్పుడు నీవుమత్స్య।
యంత్రమునుగట్టి దానిస్వతంత్రమునను । ద్యంచువారికి సుతనిత్తు
నంచుప్రతిన । జేయుమిదియెయుపాయము న్యాయమధిప ॥

రాజు—మహాత్మా అట్లైన నాకోరికదీరుట ధృఢమనుటకు వీలులేదుగ దా! మత్స్యయంత్రప్రతిన నెరవేర్చినవారికి యవ్వరైనను సుతని వ్వవలయుగదా! ఆ కృష్ణుడే కొట్టునని నమ్మకమా! మఱియొకరెవ రైనగొట్టిన మనమావలజేసెడిదేమి నారదమునీంద్రా.

నార— అదియా నీసందేహము

కం॥ ఆయుప్పరవీధినిగల
యాయంత్రము లాఘవమునసంబున నరుకన్
కాయజుజనకుడొకడు
డీయవనీపతులు నేరరిన నమతేజా ॥

క॥ యీరేడు జగములోకలై ।
బోరిన వెనుదీయబోడు భూరిబలుడు శ్రీ ।
నారాయణు డరిమర్దను ।
డారయ నాతండు నల్లుడై నీకుతగున్ ॥

హే బృహత్సేనమహారాజా నేనిదే పోయివచ్చెద.

రాజు—చిత్తము మహానుభావ.

రాజు—మంత్రీ విశారదా !

మంత్రి—చిత్తము రాజేంద్రా.

రాజు—మన భటవర్గంబంతయు సిద్ధముగా నున్నారా !

మంత్రి—సిద్ధంబుగానే యున్నారు రాజేంద్రా.

రాజు—మద్రపురాధీశ్వరుండగు శ్రీబృహత్సేన మహారాజుగారు తనపు

త్రికాలజ్ఞుంలగు శ్రీలక్షణాదేవికి చైత్రశుద్ధ పౌర్ణమి చిత్రానక్షత్రమునాడు మద్రపురంబున రాజుగారికోలువుకూటమునందు స్వయంవర మహోత్సవము జరుపునటుల నిశ్చయించినారు గాన యూపట్టుమంది రావలయునని స్వయంవరంబున విజయము నొందినవారలెవ్వరైనను వారికి లక్షణాదేవినిచ్చి వివాహంబుగావింపుమనియు మనపట్టణంబేగాక యేబది యారు దేశంబులయందు పట్టణంబులు పల్లెలు వీధులు మొదలగు స్థలంబులకెల్ల దెలియులాగు చాటింపుజేయుంచుటయేగాక తగినవారందరికి శుభలేకలుపంపుము మంత్రివరా॥

మంత్రి- చిత్తము రాజేంద్రా! ఒరే భటోత్తములారా అంగ వంగ కళింగ కాశ్మీర నేపాళ బర్బర కొంకణ కుంకణ కోసలమత్స్య మరాట సార్వమగధ ఘూర్జర మొదలగు యేబదియారు దేశములకు మీరుపోయి చైత్రశుద్ధ పౌర్ణమి లక్షణాదేవి స్వయంవరంబు చాటింపుజేయుచు ఆ యా దేశంబులయందుండు రాజులందరికి యీ శుభలేఖలుయిచ్చి స్వయంవరంబుకు తప్పక రావలశినది చెప్పితాండిభటులారా.

భటులు—— చిత్తము మహాప్రభో!

సంధి—అంతట లక్షణాభామ విరహావేదనతో ప్రవేశించును.

లక్షణ　కీర్తన　రూపకతాళం.

ఏమిసేతూ నేటులసైరింతు నేమిదోచదే భామాలార చింతగలిగె భావామందునా ॥ ఏమి ॥

చెలులు　దరువు　రూపకం.

నాతి నీ కీచింతయేమో మాతో దెల్పుమా ॥ ప్రీతిగలుగు చెలులము మ్మా వెలదీనీకునూ ॥ నాతి ॥

లక్షణ　దరువు　రూపకం.

క్షోణి శ్రీ వెలుదండ చిన్నసుబ్బరావును రాణతో నేలీన సీతారాముల తోడూ ॥ ఏమి ॥

ఆహా కాంతలారా! నేను జీవింపను గదా!

చెలులు——అమ్మా! విషయంచెప్పకున్న మేమేమి జేయంగలవారము.

క॥ ఏమమ్మ లక్షణా నీ।
వీమాట్కని చింతనొందు టేకారణమో।
మా మదికి తెలియుదాయను।
ఏమాత్రంబైనగానీ యింతిరో. ఔల్పావే వున్నబంతిరో।
దంతిగమన మేమెంతయడిగినను పంతముమాతో బల్కవదేమి।
॥ యింతిరో ॥

కందార్థం॥ నిగనిగమెఱసెడి నీసగు
మొగమునకళదరిగి దేహమునకళగలొదవెఁ
మగువరొ చంచలమతివై
యగపడియెదవిపుడు మా యమ్మరో
యిదియేమేప్పెడి బొమ్మరో
కమ్మవిల్తునివికారముగా మా నెమ్మనమ్మునను నమ్మకమే మా యమ్మరో

వ॥ అమ్మాలక్షణా నీయంతరంగంబునఁ గలచింత నీయింతులమయి
న మాతోఁ దెల్పుటకింత భయంబేలనమ్మా అట్టి భయంబెంతమాత్రంబు
నీమదిఁ దలపెట్టక నీకుఁ గలవిచారంబేమో వచింపుము మీవారలెవ్వర
కిఁ దెలియకుండా నాలోచించెదము బాలామణీ॥

సంధి॥ అని గృచ్ఛిగృచ్ఛియడిగిన నాచిన్నది యిట్లనియే॥

లక్షణ॥ కం॥ మీకంటేహితులెవ్వరు
నాకో చెలులార మిమ్మునమ్మవదానఁ
మీకొప్పని కార్యంబది
శాకలలోనైన నెంచనమ్మరే సందియము వెలికిజిమ్మరే॥
ఇమ్ముగనే మీకెరుకజేయకను నెమ్మది నాచను నిజమీమాట నమ్మరే॥

వ॥ మీరు దలంచిన నా కోరికదీర్చుట మీ కెంత కానిది వినుండు,

క॥ ఘనుడగు నారదముని మా।
జనకుని యాస్థానమునకు జనుదెంచియు నా।
తనిముందర హరిచర్యలు।
వినిపించుచునుండగా నే॥ వింటినీ॥ ఆ ఘనుని మహాలుకొంటినీ
కంటకూర్కరాదంటి నా గతేమంటి మరువురాదంటి నెందుకూ॥వింటినీ॥

చెలికత్తె యిట్లనె—అమ్మా! యింత మాత్రంబునకా యింతచింత మీ తండ్రిగారు నీకు స్వయంవర మహూర్తము నిశ్చయించినారు గనుక చింతసేయవద్దు తంటిగదా.

లక్ష—అమ్మా! స్వయంవరంబునకా మహనీయుండు రాకున్న మనమా వల జేసెడిదేమి అదియుగాక నమ్మురాంతకుని యందు డెందంబునిల్ప కుందవదన లెందరోగలరు మందగమనలార.

ఇంతకు యీ శరీరంబుతో ఆ మహాత్ముని పెండ్లాడు భాగ్యంబుండవలయు గదా సఖులారా!

లక్షణ దరువు ఆటతాళం.

అతకేలననుగోరు అతిరూపవతులైన సతులు పూర్తిగనుండగ ॥ అత ॥ హితవుగల్గగ విడెమందిచ్చుచు వినుతకే సతతము జూచిన సరస రుక్మిణియుండ ॥ అత ॥ మాటల కేటల మనసు గరగించేటి బోటిరాధయుండగా కూటాములై కనులుగిటూచు నుండేటి మేటి నెరజాణ యీ మిత్రవిందయుండ ॥ అత ॥ లాలించియును కాముకేళికి బిలచేటి కాళిందియుండాగానూ। వాలాయముగ మోహవార్ధినిబడి గోపాబాలూనికై సత్యభామా గుండగ నవుడు ॥ అత ॥ కనులకెచ్చటనైనా గనుపడ్డ చెబట్టికొని లాగికొనిపోయేటి ఘనసుందరులు గొల్ల కన్యలెందరోయుండ ॥ అత ॥ ఇలయందు కటకానిపతెకును ఘనసౌఖ్యములను వెలయుచునుండినా చెలువుగ వెలుదండ చిన్నసుబ్బారావు నలరంగ నేలేటికలికి కృష్ణుడుగదవే ॥ అత ॥

దరువు ఆదితాళం.

ఇకతాళజాలనే ॥ ఇక ॥ శుకములన్ని వికలికగూయుగనిక ॥ తాళ ॥ గడుసునముసను కంతుడునాపై విసువదలంచెను విరిశరంబులిక ॥ తా ॥ కొమ్మలార యీ తుమ్మెదలన్ని గ్రమ్మకూయ తలడిమ్ముగలిగె॥నిక తాళ॥ బాలసుబ్బయూంహ్నయు నేలిన గోపాలునిదయ నా పాలలేదే ॥ఇక తాళ॥

మన్మథదూషణ.

లక్ష. గీ॥ ఎంత దుర్మార్గుడమ్మ యిక్కంతుడిప్పు।
డనుటనిల్పియు కత్తికి పదునుపెట్టె।

దహించుచున్నాడు నాపైకి భీకరముగ।
నేమిసేయుదు దిక్కు నా కెవ్వరయ్యా॥

గీ॥ ఇట్టి దుశ్చేష్టితుండుగా బట్టి వీని।
హరుడు తన కంటిమంటచే హతముజేసి।
కాముహరుడంచు ప్రఖ్యాతిగాంచె వీడు।
మంచివాడంచు నొకరైన యంచరేమే॥

క॥ మగవాడైనను వీఁడా నగజాధిపుత్రో నెదిర్చి నారసముల తాపగ బూనివేయుగూడద। మగువలపై తారశిల్లి। మందునూ విూసం బుదీటుచుందునూ। దండివాడనని తలచునేమో నీచుండు రండ యనుచుండు చెపుంగకా। మందునూ॥

లక్ష్మి దరువు ఆదితాళం,

హరికొమరుడు వీడు। గనసరసుడేమొ కాడు। వనిత వావిగురై రగళ తిరిగెటి పరమకిరాతకుడు। హరి॥ ముద్దియలను నేచు బహు బుద్ధిహీనుడ నుచు పెద్దలెప్పుడనుచుందురు వీని పేరడంగిపోను॥ హరి॥ ఎంతదిట్టతేమే వీడు పంతంబిడ డేమే దంతిగ మగ కటకానిపల్లె పురధాముండైనట్టి॥హ॥

చంద్ర దూషణ.

ఆహా వాయుదేవుండగ్నికి సహాయ్యుండైన చంద్రమున నల్లునకు తోడై తించితివా చంద్రమా!

లక్ష్మి దరువు రూపకతాళం.

సోమా యింత క్రౌర్యమేమిరా। నాపైన నీకు। సోమా। తామసము న ధవళరుచుల నామీదికి నరుదెంతువు। సోమా। నీ యుల్లునకే భయపడి నేనుండగ నీవచ్చితివా యానంబెక్కువాయె న్యాయమేమి లేక పోయె॥ సోమా॥ ఫల్లనికాడవంచును సకలజనంబులు బల్కుదురెల్లప్పుడు బహు వేడిమి యుల్లసిల్లుచున్న వేర। సోమా। గురుభార్యను బట్టిన దుశ్చరితుడ కటకానిపలెను పరిత్ప్తిని జెందునట్టి పద్మనాభునేత్రమైన॥ సోమా॥

గీ॥ ఇట్టివాడవు నీవు గాబట్టినిన్ను॥
ముట్టుచుందును ప్రతియేట భుజగమొకటి॥

కద్రూడవు నీవు నీ మోముగాంచ దోష ।
మంచు సురగురు చెలువెళ్ల నంపె చంద్రా ॥

గీ॥ పెద్దవాడవు గాబట్టి శివుడు నిన్ను
రథమునకు చక్రముగ జేసె పృథివిమీద
నప్పుడైనను చేటురాదాయె నీకు
కళలు దరగంగ నేనపుడు గాంతు చంద్ర ॥

క॥ తరుణుల నేడ్పించెద రేవు
దరయగ మదనుండు నీవు నదిరొకో ఘనమే
పురుషుండై జనియించిన
పసువుగ బ్రతికినదె బ్రతుకు పాపపు సోమా ॥
(అని చెలులను గాంచి)

క॥ శుకపికముల ఘూతకు నే
నిక నిల్వగజాలనమ్మ యేటికి మునినా
యకు డేగుదెంచి ఘూతం
బ్రీక జెప్పెను వినగ నేను కృష్ణునిచరితల్ ॥

క॥ విన్నంతలోన నా కా
వెన్నునిపై గలిగెనమ్మ విరహంబిపుడున్
కన్నులు మూసుకపోవుచు
నున్నవి మైకంబు వచ్చెనో చెలులారా ॥

సంధి—అని లక్షణాదేవి మూర్ఛబోవును.

చెలులు వ॥ ఆశ్చర్యంబున అయ్యో యీరాచపుత్త్రి యావెన్నునిపై గల మోహసముద్రంబున మునింగె మనము యిన కొంతవరకు శైత్యోపచారంబులు గావించి దరిజేర్పుదము రండమ్మా చెలులారా!

చెలి దరువు ఆదితాళం.

ఎన్నడు యిట్టి కష్టమెరుగదీబాలా ॥ఎన్న॥ కన్నుల రెప్పలెత్తాకన్నాదీ కర్మమేమొ ॥ఎన్న॥ చలువగంధంబు దీసి చనులబూయరే ఱలుమేలుగలుగు పైన పన్నీరు జల్లరమ్మ ॥ఎన్న॥ కార్చిచ్చువోలు విరహ

దూకుచున్నావ్వా। చెప్పుడొక్కింత నిదుర జెందిన మేలుకొయ్యెఎన్న।
నేమిసేయుదమూ రీతి క్రొమ్ముక్కుడో యమ్మ పొందూగ బువ్వ నీన
ఎరమ్మా ॥ ఎన్న ॥ త్రోణీ వెలుదండ భాలసుబ్బరావునూ । రా
గీ। ఇట్టి వచు సీతారాములాతోడూ ॥ ఎన్న ॥

—అని చలువదనంబు గలుగు నుపచారంబులు సల్పుచున్న కొంత వడికి కన్నులెత్తి చలికత్తియలతో నిట్లనియె.

క। ఎవ్వరు కృష్ణుని దెచ్చెద
రెవ్వరు హరిదర్శనమున కేతెంతురు నే
నెవ్వరి బంపుదు ద్వారక
కెవ్వరు నా బాధదీర్తు రెటుదోచదుగా ॥

(ఇంతలో కృష్ణుండు కన్నులకు గోచరించిన)

వ॥ హా! కృష్ణా! ప్రాణనాథా! నిన్ను నమ్మినకాంతను నన్నింత భాధపెట్టుట ధర్మమా? నీకు కాంతల చింతనొందించుట స్వాభావమా? మ్మతిజెందుదునన్న దయతోవచ్చితివా? అని కౌగలించబోయి నివ్వెరపడి కృష్ణా! యెటుబోతివి, మోసగించితివా? ఛీ నా మైకమట్లు గనుపరిచెగాని కృష్ణుడెచ్చట? నేనెచ్చట? ద్వారకయచ్చట? మద్రపురంబెచ్చట? ఆ యదృష్టమెచ్చట? ఈ దురదృష్టమెచ్చట? ఆ మహానుభావుండు యిప్పుడు యే మందయాన కౌగిటియందు జిక్కియున్నాడో యిచ్చటికెట్లు వచ్చును కృష్ణుడు వాస్తవముగా యిచ్చటికి లాలేను.

ఇట్లు మితిలేని చింతాసాగరంబున మునింగి తేలుచుండ తన పెంపుడు చిలుక వచ్చెనటా యెటువలెన్నా॥

కీరవాణి దరువు ఆదితాళం.

వెడలివచ్చెను కీరవాణి లక్షణకడకు ॥ వెడ ॥ వెడలివచ్చెను చాలా వేడూకతోనూతి నడచూచూ లక్షణపడతి దుఃఖముమాన్ప ॥ వెడ ॥ పొందూగ భూషణములు మెడను దాల్చియు కాళ్లనందెలు బెట్టి ముచ్చటగను సుందారామూగూ తానా ముందీరంబూను వీడి కందర్పూచే బాధాజెందూ లాక్షణకడకు ॥ వెడ ॥ ధరనీయందూన కీర్తి జెందూ కటకానిష్టల్లెవు

దమూనందనాన । శిరసావహిందునా । పరగా శ్రీ వెలుగొందే బాలుడవురా
వు నినువూగ నేలేటి హరినిధ్యానింపూచు ॥ వెడ ॥

తనలో॥ ఆహా ! ఈ కాంత తన మనంబున ఆ ద్వారకాపురివాసుడగు శ్రీ
కృష్ణమూర్తియందు మితిలేని అనురాగంబుంచి బాధపడుచున్న
ది చిరకాల సహవాసంబు జేసియు కప్ప పద్మసౌరభవపు గ్ర
హింపజాలనట్లు నన్ను తాను పెంచినదయ్యు తనకు ఆ శ్రీకృష్ణుని భ
ర్తగాజేయు సామర్థ్యము నాకు గలదని యెరుగదు గాబోలు, పా
పము నేనాకార్యము నెటులనైన సమకూర్చెద.

ప్రకాశము—అమ్మా లక్షణాభామ నీ వేదియో గొప్ప చింత వహించి
యున్నదానవు, అంత చింతనొంద పనిలేదు, నీ అంతరంగంబునగల కో
ర్కె దెల్పిన నీ యిష్టంబు దీర్పుటకై సిద్ధంబుగాయున్నాను తల్లీ.

లక్ష—అమ్మా ! కీరవాణి నాకు నీకన్న బంధువులు గలరా ! గాన నీకు చె
ప్పని రహస్యమా ? తల్లీ ! నందనందనుండగు శ్రీకృష్ణమూర్తిని
నా భర్తగా గోరి ఆ మహాత్ముని సందర్శనముకొరకు పరితపించు
చున్నదాన. నా కోరిక దీర్చువారెవ్వరు కీరవాణీ.

కీరవాణి—అమ్మా ! ఇంమాత్రంబున కాయింతచింత ఆ శ్రీకృష్ణమూ
ర్తిని తోడ్తెచ్చువారెవ్వరనియా ? నీ విచారము,

కీరవాణి దరువు కమాచిరాగం ఆదితాళం.

వినుమమ్మా లక్షణా । వికచాంబుజేక్షణ । మనమునగల పగమాని
యింక ॥ విను ॥ అనఘుడైన కృష్ణునిచెంతకు నే । జని నీ చరితము విను
పించెద ॥ విను ॥ వరకటకాన్పలి పరిపాలకుడగు । హరికిభార్యవై యలర
జేతు ॥ విను ॥

క॥ ద్వారకపురి నేలెటి శ్రీ
నారాయణుడైన నంద నందనుడతనిన్
నారీమణి నేనరుగన
దారిరుగన చేరలేన తరలెన చెపవే ॥

క॥ మాటల పొంకంబెరుగన

నేటుగ నీయందు ప్రేమ నేబుట్టించే
పాటెరుగన బోటిరో యీ
లాటపములు శూఖగంబులకు దగునమ్మా ।

క॥ నలుదమయంతికి సఖ్యత
గలిగించిన దపుడు నరయ ఖగమేగాదా
ఇలజనులకు మావలె। పనులలవడు నాకార్యగతులము మేమమ్మా॥

ఎటువంటి కోటపేటలనైనా నతిక్రమించిదాటిపోగలము మాకసాధ్యం బెందైనాలేదుగాన నీవుచెప్పవలసిన సంగతులుచెప్పుము నేవెళ్లెద శ్రీకృష్ణుని తోడ్తెచ్చెదసుకుమారీ॥

లక్షణ. దరువు. ఆదితాళము

రమ్మనుమీసామినీ ॥ రమ్మ ॥ కొమ్మకునలివిగాహమ్మగద్దె ॥ రమ్మ ॥ కమ్మవిల్తునిశరమ్ములకే మాత్రమ్మునైప లేకమ్మగువకు భారమ్మవి నిన్నే నమ్మినదని నీసామ్మా చెలిజాలమ్మువలదు ॥ రమ్మ ॥ మొక్కితిననుమీమోహాంబుధిలో చిక్కితినను మీచిత్తజుధాటికి సొక్కితినను మీశుకమాత నక్క దక్కితిననుమీతరలమనుమి ॥ రమ్మ ॥ ధారునిశ్రీ కటకానిపల్లె వెలుదండ చిన్నసుబ్బారావునకు కోరికలొసగెటి నారాయణునికు కోరితిసన్నది కోమలియని ॥ రమ్మ ॥

లక్షణ—అమ్మా కీరవాణి నీకు తెలియనిదేమున్నది యెవ్విధంబుగానైన కార్యము సఫలతజేసుకొనిరావమ్మా తల్లీ.

కీరవాణి—ఆలాగేవెళ్లుచున్నాను. అని వెళ్లును.

శ్రీకృష్ణుడు. దరువు. ఆదితాళం.

శృంగారమూర్తియైయున్నాడు సౌధమునకృష్ణుడు ॥ శృంగా ॥ కనకాంబరములు ధరియించియును । జల్తారురవికల్ ఘనమోదమలర దొడిగియును । అనువుగరుక్మిణి అలసుడంతయును వనజనేత్రి జాంబవతి సత్యాతో ॥ శృం ॥ ఛట్టీయుశిరమునను మకుటంబు । ఫాలమునకస్తురి బొట్టుదిద్దియును గుల్కుముదంబు । పట్టుధుకులాంబరములు నీటుగ । గట్టిమేన శ్రీగంధమునలదియు ॥ శృంగా ॥ బంగరుపచ్చలపతకము తళతళరంగుగమెరయ యురంబునహారాయలుగ ॥ శృంగా ॥ భూరీసౌఖ్యములుచెందూచుండు కటకానిపల్లెజే

రి సరిగ్గరి వెలయుచుండు ధారుణి శ్రీవెలుకంద పెద్దసుబ్బారాయుడు మేల్
గోరటి శ్రీహరి । శృంగార ॥

వ॥ సుందరులారా! మనమెల్లరము మన కేళికోద్యానవనంబున వన
విహారము జేయుటకు వెళ్లవలయును గాన మీరు మీ మీ ప్రయాణసన్నా
హంబులతో సిద్ధముగానుండుడి కాంతామణులారా.

కృష్ణునిభార్యలు—చిత్తము ప్రాణనాథా.

నారదుడు దరువు ఆదితాళం.

రామా రఘుకులసోమా శ్రీ రమణా సుగుణస్తోమా ॥ రామా ॥ ప్రేమ
జూపు రణభీమా నిను వేడెద కోసలధామ ॥ రామా ॥ వారిధిని భగంభీర
భవ వర్జితమదనాకారా శ్రీ రామా ॥ పటుతరముగ వేదండా మునుపాలిం
చిన దేవుండా । స్ఫుటతరముగ వెలుదండ పెదసుబ్బయ నేలుఘనుండా ॥రా॥

వ॥ ఆహా! యీ మహానుభావుండు యిట్టుల నెల్లప్పుడు స్త్రీ సమూ
హంబులతో వాలలాడుచుండి వారల కలహంబులు తీర్చలేక త్రి
ప్పలుపడుచున్నాడు వీరికితోడు ఇంకొక్క యింతినిగూర్చి కలహం
బును యింకను పెంచి అప్పుడప్పుడు నాబొజ్జ నిండించుకొనుచుండెద.

కృ—నారదమునీంద్రా! నీ దేపదివేల వందనంబు లాచరించెదను మ
హాత్మా

కృష్ణభార్యలు—నారదమునీంద్రా! వందనంబులు.

నార—సౌభాగ్య సిద్ధిరస్తు. అండపిండ బ్రహ్మాండ నాయకుండవగు నీ
మహిమాతిశయంబు గొనియాడ ముప్పదిమూడుకోట్ల దేవతల
కైన తరంబుగాకుండు గదా! కృష్ణా.

కృ— మునీంద్రా! యీ సింహాసనంబలంకరింపుడు, మునీంద్రా తా
మెచ్చటినుండి యెచ్చటికి పోవుచు యిచ్చటికి వచ్చితిరి విశేషం
బులేమైన గలవా? ప్రపంచంబున ప్రజలు సుఖంబుగానుండి
రా మహాత్మా?

నార—కృష్ణా! నేను మద్రపురమునుండి స్వర్గమునకుపోవుచు స్త్రీలు వి

నారాయణుని పరమ రహస్యంబుండి మీాలో ముచ్చటించుటకు గాక యిచ్చటికి వచ్చితి.

కృ—చాలులార! యీా రోజు మనప్రయాణాం ఆగిపోయినది గాన మీా మీా యంతఃపురములకు బోండు సఖురాలా.

కృ! భార్యలు—చిత్తము అని వెళ్లుదురు.

కృ—నారదమునీంద్రా మీారు ముచ్చటించ దలంచిన విషయంబులన్ని యు నిరాటంకముగా మాటలాడవచ్చును మరెవ్వరును లేరు.

నారదుడు. సీసపద్యము. కృష్ణానినుము.

కాశ్మీరమగధాంధ్ర కాంభోజకరహాట। ఘోటమాళవమత్స్యలాటకుకుర॥ ఘూర్జరకర్నాట ఘోట్టాణకురుమద్ర। కేరళస్థావీరశూరసేన॥ సింధుమ హారాష్ట్రచేది పాండ్యవిదేహ। కుంతలద్రావి డావంతినిషధ॥ వంగాంగ మరుచోళ బంగాళ నేపాళ। పాంచాల సాళ్వబర్బరమరాళ॥

గీ॥ శకవిదర్భాది వివిధ దేశములగలుగు
పట్టణవ్రాతములలోన పారకీర్తి
సకలసౌభాగ్య వైభవాయతనమగుచు
జగతిబొగడొందదగు మద్రపురవరంబు॥

కం॥ సురపురికినరయదీటై
ఒరగిన యామద్రపురము పాలించెటియా
నరవరుడు బృహత్సేనుడు
వరకవిమిత్రుండు సత్యవర్తనుడుహరీ॥ ఆ రాజచంద్రుండు॥

మ॥ ధరపాలించెబురూరవుల్ నగరునిల్ దైత్రిశంఖుల్ హైహయుల్
పురుకుత్సున్నలు నంబరీషురఘురాముల్ రంతినంగుల్ మను త్తుర
ఘూత్తంసుభగీరథుల్ బృధుమాహాత్ముల్ న్నాహుషిల్ భార్గవుల్
భరతిత్స్మాధి పునిందిలీపుగయు మాంధాతల్ శశిబోలుచుల్॥

సీ॥ దోషాకరత్వంబు తుహినాకరునియంద మదవిభ్రమంబు సామజ ములంద॥ విప్రలంబము విటీవిటజనంబుల యంద కుటిలత్వమిం తుల కురులయంద॥ మధుపసంగతి పుష్పమంజరీతతులంద॥ ఘ

ర్షణంబులు హాటకములయుండ రాగాతిశయ విశారంబులుగాయ
కులంద । వర్ణసాంకరములు ప్రాతలంద ॥

గీ॥ పక్షపాతంబు లేద సంభవములంద
గుణపరిచ్యుతి మార్గణకోటియుండ
సన్నుతికి నెక్క నమ్మహా సార్వభౌము
డవని బాలించె బుధవర్గ మభినుతింప ॥

క॥ అతనికి నొక కూతురుగల
దతిసుందరగాత్రి శ్రీ జగమందున నరయన్
ప్రతి గనుపడదాయెను యా
సతికా యందంబు బొగడ సాధ్యమె మాకున్

సీ॥ బిబ్బోకవతి గబ్బిగుబ్బ దోయినిజూడ। మతిమాలి బతిమాలుయతి
యురతియు॥ ఉడురాజముఖకంటబడి దానిజడజూడ। జడదారిపెడదారి జ
నగదివురు॥ కన్నుమిన్నబెడంగు కన్నుసన్నలు గన్నగన్నవాడును వాల్మి
సున్నజేయు। గల్కిముద్దులుగుల్కు చిల్కపల్కులకుల్కి బల్కరింపగజా
చు గల్కిరైన ॥

గీ॥ నొంటిపాటున జెలికడనుండెనేని
పత్తరంబున వేనాంతిమెత్తవడును
జెలిశరీరమ్ము నొకపరిచేస్పృశింప
బుంస్త్వమొదవింపజేయు నపుంసకునకు ॥

నారదుడు కీర్తన ఆదితాళం.

ఆసుందారియుందాము నేనేమందు గోవిందానీకునైతె మేల్పసందూ
॥ఆసుందా॥ గందు తుమ్మెనల బోలునట్టి కురులు. లచ్చితమ్మునిమీరేటి
మోముకళలు సారసమ్ములకునన్న మిన్నకనులు నాశికమ్ముజూడ నూగు
బువ్వుహాంయులు శ్రీ కరమ్ముల దీటైన కర్ణమూలూ ॥ఆసుందా॥ శంఖ మ్ము
ను ఎదిరించిన గళమ్ము బాగ రమ్ములెకనుగొనగ కుచయుగమ్ము సిం
హమ్ముకడుము సాటియా మధ్యమ్ము భూచక్రమ్మును మించెటి కటిచక్ర
మ్ము పాదమ్ములు తాబేళ్లతో సమమ్మా ॥ఆసుందా॥ బల్ పొందూగ క

ట్రకాళిపల్లెపుట్టినయున్న యిందీవర దేవియు నై నగాని, త్రిజగవందిత వాణియు నై నగాని, యా వందీవాహనుని నతియుగాని, యాపురందాత సుందర యెనగాని ధానియందామునితో బోలనా నేర్చూనీ ॥అనుూదా॥

గీ॥ బాల్యమును బుట్టి మెడబట్టి బయటకొట్టి
యవ్వనము రా భయంబున నసగ జెలికి
చనులు చంకలు దూరెను కనులు చెవుల
దూరె నడుమెట కేగెనో తోచదహాహా॥

గీ॥ కనకమునకును పరిమళమును లభించు
నట్లు గుడిపై శిఖరమెత్తి నట్లు సొంపు
వలరు నా పతినీ కచ్చినట్టులైన
బోయురావయ్య నీయంబె బుద్ధి తనకూ॥

వ॥ కృష్ణా యా కాంత నీయందుగల మోహంబున నవరిన్నైనా బంపు నేనూ అటులబంపిన నీవా చెలిని తప్పక గొనుము నీ లక్షణంబుల కా యింతి తగియున్నది నేనిదెపోయివచ్చెద.

సంధి—అని నారదుడు వెళ్లిపోవును.

కీరవాణి—అహా ! నేను లక్షణాభామ కలవుపొంది ఈ ద్వారకాపురమునకు రావలయునని ప్రయాణంబై యిప్పటికి మూడు దినంబులాయె నేటికి ద్వారకకుమా క్రమము చేరితి ఇంక నా మహాత్ముండగు శ్రీ కృష్ణునిమందిరంబుగదా కనుగొనవలయు నా మహాత్ముని కేమి నొకయిల్లునిరుకా ! యేగోపికాగ్రుహంబున నుండునో యే భార్యామణి గ్రుహంబుననుండునో ॥

సంధి॥ అనియిట్లువిచారింపుచు ప్రతిగ్రుహంబును పరిసీలింపుచు చని చని శ్రీకృష్ణునిమందిరంబు దాపుజేరి లోపలగాంచి నివ్వెరపడి యిట్లని తలంచె॥

కీరవాణి॥ ఓహో ఇదియేనా శ్రీకృష్ణునిమందిరము అసింహాసనంబున వం టరిగాగూర్చున్న మహానుభావుడా శ్రీకృష్ణుండు కాదు కాదు ఆశ్రీ కృష్ణుడే ఆయునపదహారువేల గోపకాంతలుండ యేడ్గురుభార్య

లుండ అధము మొకరిద్దరయిన కాంతలుండక కృష్ణుండొక్కరుం డుండునా? కృష్ణుడు కాడని యోచించుదునా ఆ నీలవర్ణము, వ క్షస్థలంబున మణియు, చేతుల శంఖచక్రములు, నాభియందు వి ల్లసద్గ్రోవియు, పద్మములవంటి నేత్రద్వయంబును, ఫాలమున కస్తూ రి తిలకంబును, శిరంబున నెమిలి పింఛమును, యీ అలంకారంబు లుగల పురుషుడు స్పష్టముగా శ్రీకృష్ణుడే, ఇట్టి పురుషుడు యీ లోకంబుననే గాదు స్వర్గ మర్త్య పాతాళంబుల నిదివర్కు కని విని యెరుంగుదుమా, నిశ్చయముగా కృష్ణుడేనని యెదుట వ్రాలి,

కీర—దేవా శ్రీకృష్ణా ఇదేపది వేలవందనంబు లాచరించెదను మహాత్మా.

కృ—ఓహో నారదుపల్కులు ప్రత్యక్షంబాయెగదా?

కం॥ రమ్మా శుకమాయుటులకు
భమ్మాదిలలక్షణకును పరిణయమెప్పుడా
కొమ్మమది నేనృపాలుని
ఇమ్ముగగోరినదొ తెల్పుమెరిగెదనీవుఁ ॥

కీర—శ్రీకృష్ణామహానుభావా తామెరుంగనిసంగతి ధరణియందుగలదా! అయిన చెప్పమంటిరిగదా?

కందార్థము॥ నారదుడొకదినమున నిం
పారగ జనుదెంచి మాబృహత్సేనునితో
నీరూపు నీప్రభావము
తీరుగనువర్ణించగమా దేవికి
భ్రమగల్గెనీ కెమ్మావికి
యేవసుదాధిపునందు కెన్నునో దేవా నీపై దిగులుజెందేనూ దేవికి

క॥ మరుడురువడి విరిశరములు
నురమునగ్రుమ్మంగ మోహముప్పతిలగ మా
తరుణి నిను తలచి తలచియు
పరితాపముజెందు, గోపాలకా
వెన్నలకగకు తాళకా
బాలకృష్ణయని పలుమరుదలచును పాలుమాలునే బ్రతుకననుచు గోపాలకా

క॥ భృంగములన బెదిరిపడు ని
జాంగనలనగ పరితిట్టుచెంతురు దన్నా
భంగంబై తినియనునో
యంగజజనకా శ్రమ సేసే మందునూ చెప్పతరముగా ధందనూ
కందుమదిని గోవిందు నెపుడు నేకందునంచు బహుకలవరించునే మందనూ

క॥ మరుడువడి విరిశరంబుల
నురమును గాడంగనేయ నోర్వక నీకో
సరమై రేయింబగళులు
కరమరుదుగ నెపుడు యెదురూ గాంచునూ
నీపై మోహము బెంచునూ తాళనని చింతించునూ మించిన తమిభరి
యించననుచు వగ నించును నినుధ్యానించుచు త్రోవా గాంచు॥

కీరవాణి దరువు రూపకం.

చెప్పతరమా గాదు మాధవా। ఆ కాంతచింత। చెప్ప॥ ఎప్పుడు నిను
మదినెంచును ఎటు నే బ్రతికెదనంచును త్రిప్పలపాలై తిని కడ తేర్చువార లె
వ్వరనును। చెప్ప॥ కనులకు నిద్దురగానదు వనితలతో మాట్లాడదు ఘన
మోహాబ్ధినిబడి దరిగాంచ లేనటంచు నెంచు॥ చెప్ప॥ ఎప్పుడు కృష్ణునిగాం
చెద నెప్పుడు భాషించెద నతడెప్పుడు ననుగాంచును పెండ్లెప్పుడౌనటంచు
నెంచు॥చెప్ప॥ రమ్మా నా వెంటను లేలెమ్మా వేగమె పయనము గమ్మా
తడవేటికి కటకానిపల్లెపుర విహార॥ చెప్ప॥

కృ—శుకమా! మీ కాంత మనంబట్లుండ మీ రాజు బుద్ధి యెట్లుండెనో
గ్రహించితివా?

కీర—గ్రహించ కేమి వారిబుద్ధియు నీ యందేయున్నది మహాత్మా.

కృ—శుకమా! ఆ చిన్నదాని పెండ్లెప్పుడు?

కీర—కృష్ణా! స్వయంవరముజరిగిన తర్వాత గదా! ముహూర్త నిశ్చ
యంచేయుట.

కృ—ఓహో! స్వయంవరము నేతురా?

కీర—చైత్రశుద్ధ పౌర్ణమి బుధవారము చిత్తా నక్షత్రంనాడు మద్రపురం

బున రాజుగారి కొలువుకూటమందు స్వయంవర మహోత్సవం జ
రుగును స్వయంవర శుభలేఖలు తీస్కొని చాకలు రాలేదా!

కృ—లేదు నేడో రేపో వత్తురేమో అటులైన స్వయంవరంనాటికి తప్ప
క వత్తును పోయిరమ్ము.

కీర—కృష్ణా! నిశ్చయమేనా? చేతిలో చెయి వేతురా?

కృ—కీరవాణీ నమ్మవేల ముమ్మాటికి నిశ్చయమే.
(అని చేతిలో చెయి వేయును)

కీర—చిత్తము వెళ్లెను.

సంధి॥ అచ్చట మద్రపురంబున లక్షణాదేవి చెలులను గాంచి,

ఆహా! చెలులారా! మా కీరవాణి జాడ తెలియలేదు గదా? తల్లు
లారా! నే నేమి జేయంగలదానను.

లక్షణ దరువు ఆదితాళము.

చిలుక రాదేమో ఓచెలియచాలా తడవాయనేపోయె॥ చిలు॥ కలికి
కృష్ణునిగనలేదో పలుకరించను భయమాయనేమొ॥ చిలు॥ తోటిపక్షు
లగూడియది యాటలాడుచున్నాదొయేమో॥ తో॥ బోటిరో మనమాటా
లు నీటిలోమాటాలుజేసి యెచ్చోటనున్నాదొకాని॥ చిలు॥ మేలుగ కటకా
నిపతెనేలుచుండెడి శ్రీ వెలుదండ బాలసుబ్బయవరదుడొగో పాలునితో
గూడి భాషించెనో లేదో॥ చిలుక॥

ఇట్టుల చెలులతో బలుకుచుండ లక్షణాదేవికడకు శుకోత్తమంబే
తెంచి నమస్కరించి యిట్లనియె.

కం॥ చందనగంధిరో నేనో
విందునిజేరంగబోతి వినుపించితినీ
చందము నానేర్పుకొలది
మందర ధీరుండువచ్చు మాటలికేలా

లక్ష—ఆహా! ప్రియమిత్రమా ప్రాణదాన పరాయణ యీ సంతోషక
రంబులగు వాక్యంబులచే వాడినపైరుమీద వర్షంబు కురిశిన చం

దమాయ గదా! నామదికి కీరవాణీ ఈదినంబెంతయో పుణ్యదినం.

గీ॥ సంతసంబాయెగాని యూస్వామినీతో
వత్తునని చెప్పి రాడేమొ భావమునకు
సంశయముగల్గె శుకరాజచంద్ర నాకు
మనసుబట్టగ జెప్పు మేమనినశౌరీ॥

కీర—హా సుందరాంగీ నీడెందంబున సందేహంబునొందకు సందసందేను మతప్పకవత్తునని నాహస్తంబున హస్తంబిడి ప్రమాణంబుగా బలికి పంపించె నదియునుంగాక సజ్జనవారిసామ్మగదా యమ్మనాంతి కొండు కోరికఫలియించును సంతసింపుము నారిమణీ।

లక్షణ—కీరవాణీ యూమురాంతకుండు యింక నీనేమినిన్నడిగె నీవెల్లప్ర త్యుత్తరంబిచ్చితివి అదియెల్లపూసగ్రుచ్చినట్లుచెప్పుము ఆ మురహరునివాక్కులు యెంతవిన్నను నామనంబు తృప్తిజెందదు గాన యింకను నాస్వామివచ్చువరకు ఆమాటలచే ప్రొద్దుబుచ్చుము తల్లి

కీర—అమ్మా ముమ్మాటికి స్వయంవర ముహూర్తంబున కా మధుసూదనుండు తప్పకవచ్చు సందేహంబులేదు గమనాయాసంబుచేదప్పికాయె పోయి దాహంబార్చుకొనివచ్చెద అనంతరమాదు మాటలాడుకొనవచ్చును॥ (రాచపుత్రి శెలవిమ్ము నేనిదే పోయివచ్చెద)

లక్ష—పోయిరమ్ము మిత్రమా.

బృహ—మదిని నారదుడాడెడు మాటలెంచి। సుతకు హరిపైన మోహంబు సతిశయిల్లు। ఓరిగి మనమున యోచించి యిట్టులనియె। సంభ్రమంబున మంత్రితో జనవరుండూ।

ఆహా! మంత్రి విశారదా! నా పుత్రియైన లక్షణాదేవికి స్వయంవర ముహూర్తంబు నిశ్చయించిన సంగతి శుభలేఖలు దేశ దేశంబులకు పంపుమని చెప్పియుంటినే పంపితివా!

మంత్రి—రాజేంద్రా! తమ యాజ్ఞానుసారంబుగా నప్పుడే పంపితిని పోయిన చారులింకను రాలేదు మహానుభావ.

రాజు—మంత్రీ! స్వయంవరంబునకు రాజాధిరాజులందరు మన వీటికే తెంతురు గదా! గాన మన పట్టణంబెల్ల నలంకరించి, కస్తూరిచే నలికించి, ముత్యాలముగ్గులు బెట్టించి, పచ్చలతోరణంబులు గట్టించి మన పట్టణంబలంకారము చేయించుము మంత్రివరా.

మంత్రి—తమ యాజ్ఞానుసారము చేయించెదను స్వామీ.

రాజు—మంత్రీ! మన కొలువుకూటంబునకు దాపుగా నూరుగజంబుల యెత్తున స్థంభము నాటించి దానికొనన బంగారు మత్స్యమొకటి కట్టించి ఆ స్థంభము మొదట కొంచెము జలముపోస్సి నొకబంగారు పళ్లెము బెట్టించి నచ్చట జాగ్రతగా ఖాడ్గారియుంచుము మంత్రివరా.

సంధి॥ ఇటుల మద్రపురంబున రాజుగారు సర్వ ప్రయత్నములు చేయుచుండగా॥ (అచ్చట ద్వారకయందు శ్రీకృష్ణుండు)

కృష్ణ. దరువు. ఆదితాళము.

నేనెపుడూజూచెద నానతిని మదవతిని ॥నేనెపు॥ యెపుడుజూతు నేనెపుడుబోదు పలుకెవుకువిందు మదికవుకుప్రీతి ॥నేన॥ ఒకఘడియాజూడగయ గమా యె నెటుజేయా ॥ఒక॥ కడువిరహాబ్ధినిబడితి నన్నజాతరుణిని నాతోడపె నిడికొని ॥నేన॥బహుమేలు గుల్కె కేటి బలియుండు వెలుదండ ॥బహు॥ బాలసుబ్బయాంమ్మాయు నేలెటిగోపాలమూర్తి నిక తాళజాల॥నేన॥

సీ॥ ఆరాజవదనశృంగారంపు చక్కఁదనల్ వేడుకచే ముద్దులాడుటెపుడో ఆచిన్నదాని తియ్యనిమోవితమి దీతగ్రోలగ ల్గెటి మేలుకూడుటెపుడో ఆకాంతతోడగు నేటనటియూ రెవికముడి నాకరంబులవిడుచుటెపుడో ఆ కుందరదన నాణ్యముగల్కు నడుము నానందిటుంచుక భోగమందుటెపుడో ॥ గీ ॥ అరయభూచక్రమున కన్న నందమలరు లలనకటిచక్రమును జూడగల్గుటెపుడో రంభలనుధిక్కరించు నారమణితోడలు కైఖరిని గనుగొనెడి నాభాగ్యమెపుడో॥

శ్రీ కృష్ణుకు దరువు ఆదితాళం.

రమణినిజూడక నే నెటుతాళుదు ॥ రమ ॥ సుమశరఘాతకు సోలితి బ్రా

లిత తమకము మించెను చాలా ॥ రమ ॥ చిలుకలు కిలకిలబలుకగ తలకును గలిగెను భారము బలముగ ॥రమ॥ ధారుణి శ్రీ వెలుదండ చిన్నసుబ్బారావును నేలధీరుడ ॥రమ॥

సంధి॥ ఇట్లు శ్రీ కృష్ణుండు లక్షణాభామమీాది మోహంబున నిద్దియుం దోచక ఆహారనిద్రలు వర్జించి లక్షణాదేవి స్వయంవర శుభలేఖలు యెప్పుడు వచ్చునోయని దినమొకయుగముగా గడుపుచు పరితపించుచుండగా మద్రపురాధీశుండగు బృహత్సేనుని చారులరుదెంచి॥

చారులు—మహాప్రభో కృష్ణా! మేమిదే నమస్కారము లాచరించెదము మేము మద్రపురాధీశుని భటులము. మా రాజు పుత్రి లక్షణాదేవికి యీా శుద్ధపౌర్ణమి బుధవారంరోజు స్వయంవరము యేర్పాటుచేసినారు. మిమ్ములతోడ్కొమ్మని పంపిన వచ్చితిమి యిదియే శుభలేఖ చిత్తగింపుము (అని చేతికిత్తురు)

కృ—శుభలేఖ నందుకొని చదువుకొని, చారులారా! స్వయంవరంబునకు సకలదేశాధిపతులు వచ్చియున్నారా?

చారులు—మహాప్రభో! కొందరుయిదివరకే వచ్చియున్నారు కొందరిప్పుడువచ్చుచున్నారు ఇంకనుకొందరు ప్రయాణంబులగుచున్నారు ప్రపంచంబునంగల రాజులందరితో చైత్రశుద్ధ పౌర్ణమి నామద్రపురము శోభాయమానముగా వెలుంగగలదు తామెప్పుడు ప్రయాణం.

కృష్ణ—చారులారా మీారాచపుత్రి స్వయంవరంబునకు మీారాజుగారు యేమిపందె మొడ్డినారు.

చారులు—అదిమేమెరుగము గాని కచ్చేరిముందర పెద్ద మొగరమొకటి నాటించినారు దానికొనకు ఒక బంగారుచేపనుకట్టినారు ఎందుకో

కృ—ఓహో మత్స్యయంత్రమానరే మీారువెళ్లండి నేనువొచ్చెదనని చెప్పగా భటులు పోవుదురు.

రాజపుత్రులు దరవు ఆదితాళం.

రాజపుత్రులు వెడలిరపుడు శ్రీ మద్రపురికి ॥రాజ॥ రాజసుతులు రవితే

జములలరగ భూజనులదరగ భుజబలమొప్పగ ॥రాజ॥ కోటిభాస్కరుల కాంతివెలయ ధరియించి కనక కిరీటంబులు శిరములందు మెరయగా । ధాటిగ నిశానముదీటుచు భువి మాసాటివార లెవ్వోట లేరుయని ॥రాజ॥ భూరికాల్బటులు నడచుచుండ కరితురగములెన్నో తేరులేపార గదలుచుండ భేరి మృదంగము ఘోరునమ్రోవగ ధారుణివణకగ వారిధులదరగ ॥రాజ॥ శ్రీకటకానిపల్లెపురిని వెలుదండ బాలసుబ్బారావును బ్రోచుమహిని రాణతొడలచుచు రమణులు ముందర వీణెలుమీటుచు వేడ్కతో బాడగ॥రాజ॥

వ॥ వరే! ద్వారపాలకులారా!

ద్వార—ఆహా! ఏమి భూపాలోత్తములారా!

రాజు—మీ రాచపుత్రి స్వయంవర ముహూర్తంబునకు వచ్చియున్నాము గాన మారాక మీ బృహత్సేనమహారాజుగారి కెరుక జేయుముతా.

భటు—చిత్తము.

సంధి॥ భటులు బృహత్సేన మహారాజునుంగాంచి॥

భటు—రాజేంద్రా! కరితురగ రథ బృందంబులతో రాజాధిరాజులందరు సకలసైన్య సమేతులై వచ్చి మన కోటవెలుపట నిండియున్నారు మహాప్రభో.

రాజు—ఆహా మంచిది మంత్రీవిశారదా రాజాదిరాజులువచ్చి యున్నారట వారినితగిన మర్యాదచేత మనపట్టణంబులో తగిన భవనంబుల యందు విడియించి భోజనతాంబూలములు కొరంతలేకుండా విచారింపుచు నాకి వారియొక్క సేవకావృత్తికొరకు కొందరుపరిచారకుల నుంచుము మంత్రివరా॥ మంత్రి చిత్తము.

లక్ష—సఖీమనులారా రాజులందరుయేతెంచిరి కృష్ణుండుమాత్రం రాకబోయె స్వయంవరమూహూర్తంబు రేపేగదా కృష్ణుండు రాకపోవుటకు కారణంబేమో తెలియదు చెలులారా నేనేమిచేయుదు అని యటుల నో ఆరాత్రిగడపియు మరునాడున్ను కృష్ణుమరాకున్న చెలులంగాంచి

లక్షణ దరువు ఆదితాళము.

సుందరాంగా జేలరాకా పోయెనే రాజు లందారేతెంచినారీవేళనే నా

డెందామందూన దిగులుజెందేనేనేమిచేతు ॥సుం॥ నామీఁదదయలేదేము సామికీ వత్తు నంచుచెప్పినవితానేటికి యీకామాజనకూని రాకకై చూచుచున్నదాన ॥సుంద॥ నమ్మించి జెఱచుతాఁడాకృష్ణుడు తనను నమ్మీయుండీనదాననేప్పుడు న్యాయమ్మావిడనాడి మోసమ్మా జేయునాయేమి ॥ సుం॥ ధరణి కటకానివల్లెనుండెటి శ్రీ వెలుదండా చినసుబ్బరావూనేలెటి శ్రీహరి నికామించియుంటి నరుదెంచడింతకును ॥సుంద॥

క॥ జగధీశులెల్ల వచ్చిరి। తగనుద్వాహంపువేళ దాఁకొనవచ్చెఁ జగ
దేకవీరుఁడగు హరి। మగువరో యీవరకురాడే॥ మంధునే శౌరి
వన్నపుడు పొందునే తమినటులాసైచీ॥ యుండునే। నందసుతు
డు రానందుకిపుడు బలుసందియమయ్యెను స్వాంతంబుననే ॥ మందునే॥

దరువు ఆదితాళము

రాజవదనరో వినగదవె దిన రాజతేజుండైనకృష్ణుడు రాడుగా నన్నుజూడగా చేతచెయ్యిడినాడునీతో జేయుబాసలుదప్పెనేమీ సేతునే తమినటు సైతునే ॥రాజు॥ సుందరాంగునిగందుననివా డెందమునవా వందమొందితి సుందరీ కంబుకంధరీ ఏవగనుగూడెదను సుబ్బారావునేల్ కటకానిపలివురి దేవునీ దివ్యప్రభావునీ॥

దరువు ఆదితాళము

లక్షణ—తరుణులారా తమిభరింపతరముగాదికఁ సరగునకృష్ణూనితోడసర
సమాడకా ॥తరు॥

చెలులు—సరసిజాక్షీ మీరరాని జాలియేలనే। కోరినకోరిక దీర్చు సారసా
క్షుఁడు ॥ సర ॥

లక్ష—ఎన్నడుననుజేరు కోర్కెలెన్నడుదీరూ కన్నులవిలుకాని బాధగానకే
మీరూ ॥ తరు ॥

చెలులు—నన్నుతాఁగి మునుపటి బాసలను మరచునా నిన్ను కనులజూడ
కచట నిలచియుండునా ॥ సర ॥

లక్ష—అందమున నా కన్న మిన్నలైన కాంతలు మెండుగాఁగల రతనికిప్పుడే
టి మమతలు ॥ తరు ॥

చెలులు—కంధునగాదమ్మ శ్రీ కట । కాన్పలీశుని । కంటు । వ చిర కాలమున
కా ఘనఘ నాంగుని ॥ పర ॥

సంధి॥ ఇచ్చట ఇట్లుండ, అచ్చట ద్వార కాపురంబున్నా ॥—

సీ॥ బంగారు మకుటంబు రంగుగా ధరియించి తళతళ కర్ణకుండలములమర । తారహారావళుల్ ధగధగ దీపింప పై పచ్చడము హాయల్ బరగుచుండ । మైనిండ నలదిన మంచి గంధంబును ఘుమఘుమ పరిమళంబు మనుచుండ । రత్నదీప్తులమించు రాజించు కంఖణాల్ కరయుగ్మమున మహా కాంతిజనర ॥

గీ॥ దివిజవర్యులు మింట గీర్తింపుచుండ
హస్తమందున చక్రంబు నమరియుండ
భావమందున లక్షణాభామ మీాది
మమతలుప్పొంగ హరివచ్చె మద్రపురికి ॥

శ్రీకృష్ణుడు॥ దరువు మధ్యమావతి ఆదితాళము.

నందానందనుడు వెడలేనపుడు శ్రీమద్రపురికి ॥నందా॥ పొందుగనన్నర సుందరీమనులు ధింద తక్క తకధిమియని నాడగ ॥నందా॥ కోరికతో శృంగార మొప్పగను తారహారములు ధరియించియు శ్రీ ॥నందా॥ పరగదుకూలాంబరములు గట్టియు సరభసముగ మేల్ శాల్వధరించియు ॥నందా॥ ధారుణి శ్రీ వెలుదండ బాలసుబ్బారావుకు జల్ కోరికలొసగేటి ॥నందానందనుడు వెడలేనపుడూ॥

కృ—నరే! ద్వారపాలకా!

ద్వా—ఆహా స్వామీ.

కృ—శ్రీ కృష్ణుడు వచ్చినాడని మీా బృహత్సేన మహారాజుకు చెప్పుమురా
నరే.

భటు—చిత్తము అని రాజునుసమీాపించి ద్వార కాపురము నుంచి శ్రీ కృష్ణ
మూర్తిగారు వచ్చి మన కోటవాకిట నిలచియున్నారు స్వామీ.

రాజు—ఆహా! ఆ మహానుభావుండు రాలేదని నిరీక్షింపుచుంటి ఇప్పటికి

నా డెందంబున కానందంబై నది పదండి వెళ్లుదము అని యేతెం
చి కృష్ణునింగాంచి॥

క॥ మీ దర్శనమున మనమున
మోదము విలసిల్లె సకలభువనములకు నీ
వే దేవుడవందుకు బుధు
లోదానవవైరి మమ్ము నొప్పగా
బ్రోవుము దయతో మెప్పగా ॥

తప్పక నిను భువిధ్యానించిన మది తిప్పలు లేవని జెప్పదు రార్య లొప్పగా॥

సంధి॥ ఇట్లువినుతింపుచు దోడ్కొనివచ్చి యొక దివ్యమందిరమున శిం
హాసనాసీనుంగావించి యిట్లనియె ॥

రాజ—ఆహా స్వామీ దేవకీనందనా.

కృ— యేమోయి బృహత్సేన మహారాజా

రాజ—మహాత్మా తాముయీభవనంబున నివసించి మేమిచ్చునాతిథ్యం
బుగొని మమ్ములకృతార్థుల జేయుము ప్రార్థించెదము నేను వెళ్లెద
సెలవిమ్ముమహాత్మా.॥

కృ— ఆహా వెళ్లుము యీసందడికాలంబున నొక్కరినే మరియాద జేయు
టకు వీలుగాదుపొమ్ము.

సంధి॥ ఇట్లుకృష్ణునిచే శెలవుపొంది కొలువుకూటంబునకేతెంచి వచ్చినరా
జులందరికి తగినమర్యాదలు జేయుచుండె అంతట చెలికత్తియలు ల
క్షణాదేవిని సమీపించి

గీ॥ కృష్ణుడేతెంచినాడమ్మ కీరవాణి
రాజవర్యులలో మహారాజనంగ
భూరినక్షత్రములమధ్య పొల్పెసంగు
చంద్రుడోయన గన్పించె జలజనయ

క॥ మృగములలోన చరించెడు
మృగరాజన వెలయు ముద్దు కృష్ణుడు నిపుడీ

జగతీనాదులలోగన
మగువా నీభాగ్యమేమి మగడామెగదే ॥

లక్ష—అమ్మా ఆనందనందనుని అందచందములు నారదుడు మా తండ్రికి నిరూపించుచుండగా విన్నదేగాని యింతవరకా మహనీయుండు యెట్టివాడైనది నా కన్నులతో జూడలేదుగదా సఖులారా ॥

చెలులు—ఇంక చూచెదవులేవమ్మా లక్షణా.

బృహ—ఆహా చెలులులారా!

చెలులు—ఏమి రాజోత్తమా?

బృహ—గీ॥ ప్రేమచే మన లక్షణాభామ నిపుడు
జలకమాడించి బంగరు వలువ గట్టి
భూషణంబులు ధరియించి పొందుగా
నలంకరించుడీ వేగ నాలస్యమేలా ॥

మంత్రీ విశారదా!

మంత్రి—చిత్తము రాజేంద్రా.

రాజు—గీ॥ మీనయంత్రంబు నొకటి నిర్మించి భువికి
చాలయెత్తున గట్టుడీ వరభవనముగ
దాని ద్రుంచిన భూపాల తనయునకును
యిచ్చెదను నా సుపుత్రికనిచ్చ మెచ్చి ॥

మంత్రి—రాజేంద్రా! ఆపని యింతకుముందే సిద్ధపరిచియుంచితి.

రాజు—మంచిది, ఈదినము పగలు 12 గంటలకు స్వయంవరము జరుగునని మన పట్టణంబున యెల్లచోటుల దండోరా వేయింపుము మంత్రివరా.

మంత్రి—చిత్తము రాజేంద్రా.

లక్షణ దరువు. ఆదితాళం.

తరలేలక్షణ తరుణీసభకు వరగునతండ్రి కొలువుపొందియు ॥త॥ కురులు దువ్వి జడజుట్టి వరసు గరము మొగలుపూయైనట్టి మేల్ బంగరుపుబిళ్లలను బె

ట్టి ధగధగ మెరయు మణులుస్థాపించిన కమ్మలు ధరియించియు కర్ణములకు సొంపుగ ॥తర లే॥ కనకచేలముగట్టి వేగ వనితాలిరుప్రక్కలజేరి నడువగ కనులకాటుకదీర్చి సోయగ మున తిలకంబునమర్చి కరకం ఖణములు చెలువుగాదాల్చి విడియం బును జేయుచుమేనున శ్రీగం ధమ్ము బూసియుమోహినికన్యకయన ॥తర లే॥ చరణాబ్జముల స్వర్ణకడియాల్ ధరియించియును స్థిరముగాను మురిపెముతో నడచుచును వేగమె తరులరమ్మంచును సారస హరినిజాతమంచును కీర్తినిబరగుచుండు వెలు దండబాలసుబ్బయనేల సీతా పతిని భజించుచు ॥తర॥

వచనం॥ జనకా యిదేపది వేల వందనంబులు.

క॥ వందనమిదె తండ్రీ జన
వందిత భూజనవినోద వరకవిమిత్రా
వందనము దీనరక్షక
వందనములగొనుము సత్యవర్తన సుగుణా ॥

రాజు—దీర్ఘాయురస్తు సుమంగలీభవ.

క॥ వర్ధిల్లుము వరగుణవతి
వర్ధిల్లుము దివ్యగాత్రి వారిజనేత్రీ
వర్ధిల్లుము సుచరిత్రీ
వర్ధిల్లుము నాదుపుత్రి వర్ధిలుముతగన్ ॥

అమ్మా యీ రాజపుత్రులలో నీమత్స్యయంత్రంబెవ్వరు ఛేదించునరో నీ వామహానీయుని భర్తగావరించి యాతనికంఠంబున యీ పుష్పమాల వేయుము అని పుష్పమాల యిచ్చును ॥

లక్ష— భాగ్యముజనకా అని మాలగైకొనును ॥

రాజు—ఒరే బటోత్తములారా ముసలముద్గరతో మరభిండివాలాదియాయుదంబులు ధరియించి జాగ్రత్తగా నీ లక్షణాదేవివెంటవుండి ఈ మత్స్యయంత్రమునరికిన రాజశేఖరవుని కంఠంబున మన లక్షణాదేవిచే నిప్పుష్పమాలవేయించి నృత్యగీతాది సమస్తమంగళ వాద్యంబులతో వీరిద్దరిని పట్టపుటేనుంగుపై గూర్చుండబెట్టుకొని మ

న అంతఃపురమునకు జాగ్రతగా తీస్కొనిపోవలయు భటులారా॥

భటులు—చిత్తము మహాప్రభో

సంధి॥ అప్పుడురాజులందరు మీనయంత్రమును పారజూచుచు సింహాసనంబులధిష్ఠించియుండిరి శ్రీకృష్ణుండొక్క గద్దియుప్పై గూర్చునియుండె నంతా॥

స్వయంవర మహోత్సవము.

శూరసేనుడు. పరవు ఆటతాళం.

ఎంతోవింతగానున్నది యీ యంత్రమునుగాంచ ॥ఎంతో॥ అంతరిక్షమందు నగుపడకున్నది ఎంతకృష్టించిన ఎట్టులదిక్కృంచేది ॥ఎంతో॥ క్రిందజూచి గగనమందాలి యంత్రంబు సంధించి శరమున ద్భంచందరెవ్వారికైనా ॥ఎంతో॥ చెలువుగ వెలుదండ చిన్నసుబ్బరావు సలరంగ నేలేటి కలికికృష్ణునిసాక్షి ॥ఎంతోహార॥

జయసేనుడు—రాచవిద్యలకు దగి నటియించెడి రచ్చయిదే శ్రద్ధగా।
చూచెడిరాజులు చోద్యముగొందగ శూరతజూపనుతరిగా॥

శిశుపాలుడు—ఎవరికీ బృహత్సేనుని సుత లభియించునో తెలియగరాదూ।
అవనీనాయకులే తెంచిరి యీ యంత్రము సాధ్యముగాదూ॥

సంధి॥—తక్కినవారిలో,

క॥ కొందరు దృంతు మటందురు
కొందరు నేమనక యూరకుందురు తమలో
కొందరు భ్రమచే గుందుచు
నందదనుచు ప్రాప్తి లేదటందురు మదిలో॥

శూరసేనుడు—గీ॥ నీటిలోజూచి యామింటినాటియున్న
యంత్రమెట్టుల నరికివేయంగవచ్చు
కానిపనిఇది దీనికై పూనగూడ
దైనగుదినిల్పి శరముక్కవైనవిడుతూ॥

అని నేర్పుగలిగినట్లు బాగా లక్షముంచి శరప్రయోగము చేయును॥

జయసేనుడు—శూరసేనా యిదియా నీ శరవిద్య నీచే విడువంబడిన ఆయుధము రెండు మూడు మూరల యెడముగా పోయినది యింకేమి చేయగలవు అటుగూర్చుండి చూచుచుండుము ॥

క॥ చూడుడి యీ యంత్రంబును
పోడిమి మెఱయంగ ద్రుంచి భూపకుమారిన్
వేడుకగుల్కగ నాపెం
డ్లాడెద నటుగాక నృపుడటందురె నన్నున్
అని మహావీరునిపోల్కి లేచి శరంబువిడిచినది వ్యర్థంబైన కూర్చుండును।

శూరబాహుడు— జయసేనా! శూరసేనుని పరిహసించినవాడవా నీవు రాచపుట్టుకపుట్టితివా అయిదారుగజములు వ్యత్యాసముగా ఆయుధంపోయినదే నీ ధనుర్విద్యాగాల్పనా?

కీర్తన ఆదితాళం

ఓ నరవరులారా యిపుడీ నరపతిబన్న మీనయంత్రమును ద్రుంచక పోయిన హానిపరువునకునూ ॥ ఓనర ॥

వ॥ నాకంటెముందు యిద్దరు ముగ్గురు రాజులు యంత్రమును గొట్టదలంచి విఫలమనోరథులయి కన్నుల నీరిడుచు చూచువారలు నవ్వుచుండగా అధోముఖులై కూర్చుండిరే కాని కార్యంబేమియు లేకపోయె, మిగత రాజలోకంబు మాటచూడ, యీ ప్రయత్నములో (పాపము మాకు సాధ్యముకాదని కాబోలు) నున్నటులే లేదు, ఇప్పుడు యిచ్చటికి నేను రాకున్న యీ యంత్రమును గొట్టువారెవరు? అని శరప్రయోగముచేసి వృథాయైన ఆశ్చర్యపడియుండును.

కృ—క॥ ధీరవరుండును జగదో
ద్ధాముడు కంసారి ఘోరదనుజ హరుం
డున్। భూరిపరాక్రముడాహవ
శూరుడు కృష్ణుండు నందసుతుడటుదెంచెన్॥

ఇట్లు మీనయంత్ర సమీపంబునకువచ్చి బృహత్సేనునితో శ్రీకృష్ణుండిట్లనిప

శ్రీకృష్ణుడు దరువు ఆదితాళం.

జననాథాయీ ఆ నిమిషయంత్రంబును ద్రుంచుటయొక ఘనమా ఓహో గనినీటను యాకసమునగట్టిన ఘనయంత్రముగొట్టిన నధికుండా ॥జన॥ మీనయంత్రముద్రుంచు నృపాలునకే నొసగెద సుతనని నీవుబూనుకొనినపని నే నెరవేర్చెదగాన గనుడి మీ మానసములరగ ॥జన॥ కోటి రాజులను రప్పించితివిది గొప్పశక్తిగాదో చెనసీకు ధాత్రిణి శ్రీకటకానిపల్లె పురధాముడనే రణభీముడనైతి ॥జననాథా॥

సంధి॥ ఇట్లు బలుకుచున్నకృష్ణుని గాంచి రాజులందరు హేళనగాబలుకదొడంగిరి॥

గీ॥ మనకసాధ్యమైన మత్స్యయంత్రంబును
గొట్టకలచివచ్చె గొల్లడితడు
ఇతనికింతగచ్చు లేటికినూరక
నుండడాయె గాయుచుండిపశులా

ఓహో కృష్ణాయేమట్లుబోవుచున్నావు గొల్లభామలు చల్ల జేయుచున్నారనుకుంటివా! పాలకడవలు దొంతులు దొంతులుగాబెట్టి వుట్లుగట్టినారనుకుంటివా! గొల్లభామలు చీరలుగట్టునవుంచి జలక్రీడలాడుచున్నారనుకొంటివా! అచ్చటనీకు వుపయోగించు వస్తువులు లేవురమ్ము మహాపరాక్రమవంతులమై బలవంతులమై ఉత్తమక్షత్రియవంశంబున జన్మించ్ని మేమేని లువుగండ్లుబడి చూచుచుండగా యింకనీవా ఆ యంత్రంబును గొట్టునది చూచువారలు నవ్వరా అని హేళనగా బల్కుచుండగా॥

కృ—గీ॥ మొలకమీనంబు దీటుచు మురహరుండు
శరము సంధించి ధనువున చపల సురలు
వాహ్వ రే మేల్ శభీయని ప్రస్థుతింప
మత్స్యయంత్రంబు నవలీల మూడిరిగను
ద్రుంచె భూపాలకులు తలవొంచుకొనగా॥

అప్పుడు లక్షణాభామ సిగ్గుపడిన భావంబుతో కృష్ణునిచెంత కరిగి ఇట్లనియె॥

క॥ స్వామీ దేవకినందన

కామజనక మీనపాల గరుడతురగ నే
శ్రీపుత్తో వేసిన గొనుమూ
నీ మెడనిదె పుష్పమాల నీరజనాభా ॥

అని పుష్పమాల కంఠంబున వేసి భూరిభేరి నినదంబులు నింగి ముట్టినప్పుడు అచ్చటనున్న రాజులు,

గీ॥ రాజవరులారా గొల్లడు రాచకన్య
వరించుకొనిపోవ సిగ్గులేదేమి మీకు
నందు గీతిల్ల రాజధర్మంబు గాదు
వీని గర్వంబడంచియు వెలదిని తగు
భూతలాధిపునకు పెండ్లి చేతమిపుడు ॥

రాజులు దరువు ఆదితాళం.

రండి రండి భూరమగుబార భండనముసకును బలేనమయమిది ॥రం॥ దండిమగలు భూమండలాధిపతులుండి గొల్లనికిలోగుటతగునే ॥రం॥ గొప్ప రాజులముమనమైవచ్చి గోలుపోయి సత్కీర్తినియిచట మొప్పెగొల్లడా ముదితనుతీసుక ఒప్పగవెళ్లగ నోర్వవశమేమది ॥రండి॥ ॥రండి॥ ధారుణి శ్రీవెలుదండ బాలసుబ్బారావును పరిపాలించెటియా ద్వారకపురహారధాముని నెదిరి పోరుజేయుదము పోనియవలదు ॥రండి॥ ॥రండి॥

(అని పలుకుచు బృహత్సేనమహారాజునుగాంచి)

క॥ ఆ వెఱ్ఱిగొల్లనానికి
నీ వసుధను రాజులుండ నిచ్చితివి సుతన్
భావింప వెచ్చు తగ్గులు
నీ వెఱుగవు తెలివిలేని నృపుడవు దలపన్॥

అని బృహత్సేనుని నిందింపుచు రాజులంద రొక్కుమ్మడిగ పై కరితురగ రథకాల్బలంబులతో శ్రీకృష్ణునిపై విజృంభించిన గని లక్షణాభామ భయకంపితమానసురాలై ॥ (శ్రీ క్రుష్ణుని గాంచి)

లక్షణ దరువు ఆదితాళం.

ఏమి జేసెదను నా నోముఫలంబిది ధీమసంబున నే తెంచిరి శత్రులు

॥ఏమి॥ సామజఘోటక సైన్యముగ్రమ్మెను సామీ నీ వక్కడ వే నమత ముగ్గలెనే ॥ఏమి॥ చెట్టాదు పెదబొబ్బ లట్టహాసమున గట్టిగ రాజులు జుట్టుకొనిరి నే నేమి త్మాతలమందు కట కానిషల్లెపురి ఖ్యాతిగ నేలు తెూగాన విలోలా॥ఏమి॥ (అని దుఃఖించుచున్న లక్షణాదేవినిగాంచి కృష్ణుండిట్లనియె)

కృ—కాంతామణీ! నా పైకివచ్చు రాజాధములను గాంచి యేల చింతిం
చెదవు నొక్క సింహ్మంబునకుగని పెక్కు గజంబులేమి సేయంగలవు
గాన యీ దుష్టాత్ముల భంగపాటును గనుగొనుచుండుము.
చక్రము కేలఁదాల్చి వరే రాజాధములారా!

క॥ తెలపగ కార్చిచ్చునబడు
కలభములన మీరు నాదు కర వేడిమికిఁ
బొలియుదురు కలహమున మిము
దలపడినను వదిలిపెట్ట తాధ్యమూ
నను గెల్వ మీకా సాధ్యామూ
సాధ్యపడను నిశ్చయమిది మీ శరవిద్యలన్ని విడివెళ్లుడు మేలూ ॥తాధ్యా॥

రాజు—వరే గొల్లవాడా!

క॥ గొల్లలగ్రుహముల జొచ్చియు
చల్ల పెరుగు దొంగిలించు శౌర్యంబున గో
వల్లభ జూపకు మిచ్చట
వెళ్లుము యీ సభని విడిచి వేగమే
లేకుంటే ప్రాణా త్యాగమే
బాగుపడవు భూపతులమైన మా తో గర్వించక తొలగిపోరబలు వేగమే॥

కృ—ఒరే రాజాధములారా!

క॥ చచ్చెదరని జెప్పిన మీ
మచ్చరమును విడువలేక మాపైకనికిఁ
వచ్చెదరిటు నాచే మీ
రిచ్చటనే జచ్చుకొరకు ॥నీప్పుడు॥ వన్నెరుగారా మీ రేప్పుడు॥ మొప్పెత నమునను మోహించితిరి గొప్పకొంచమును గుర్తెరుగకమీ రేప్పుడు॥

రాజు—ఔరౌరా అలగా పరీ.

క॥ గోవులగాసుక భువిఁబ్రతి । కేవాడవు యుద్ధమేటికిరసీకును మా । చే
వ నెరుంగవు బల్కెడ । వీ వేళను బంటుఁబ్రజ్ఞా వేలనూ। విమువారా
సీవీ బాలనూ॥

అలమందునిన్ను హతముజేసెదము బాలకృష్ణ యీపంతముబూనూ।
టేలనూ ॥

కృ—క॥ ధరణీస్థలినతయుగ భీకరముగ హరితో నెదిర్చి కలహంబునకుఁ
బర తెంచిన కరులనబా రరుదెంచితి రాజకోనరాధములారా ॥
(అని చక్రంబు కేలఁ దాల్చి)

కృష్ణుడు దరువు ఆదితాళం.

గనుడీనాశక్తి మీరాలిపుడు రాజాధములారా ॥గను॥ ఘనతురగంబు
లు కరులరదంబులు తునియలౌను నా దోర్బలమొప్పగ ॥గను॥ పనిబడితే
మిముపదలిపెట్టనని వినజెప్పితినిక । వినుపను ద్రుంచెద ॥గను॥ ధీరవరుల
మని జేరవచ్చితిరి పోరునల్పుడిక పారగనేటికి ॥గను॥ ఘోరదనుజులను
ధారుణిగూల్చిన భూరిబలుడ నా పేరెరుంగరా ॥గను॥ పలుకులేటికిక కల
హామునందున నిలువుడి మీ తల లిలనురాల్చెదను ॥గను॥ ధారుణి శ్రీ వెలు
దండ బాలను। బ్బారావునకాధారమూర్తినిక ॥గను॥

ఇట్లు ధుమికి సైన్యంబు చీకాకుపరచి అట్టహాసంబుగావించిన ప్రతిమ
నుజున కొక్కొక్క కృష్ణుండు చక్రధారియై యెదుటనిలువంబడి పైకి యు
ద్ధంబునకు కాలుదువ్వుచుండిన నా రాజులందరు ప్రాణంబులు దక్కవని॥

రాజు—ఓహో! రాజులారా! ఇట్టి కన్యలు మన పట్టణంబుల నెందరోగ
లరు అదిన్నిగాక ఈ లక్షణాదేవియందు దుష్టలక్షణంబులు కొన్ని
గలవు అందువల్ల బొత్తిగా మనకు పనికిరానిదే అని పారిపోవుదురు.

శూరభాహుడు—పారిపోవుచు అన్నలారా లక్షణాదేవి నాకంత లక్షణవం
తురాలుగా కనుపడలేదు ॥

జయసేనుడు—అది అటులుండ గొల్లవాడు కోరినస్త్రీ మనమువరించుట
కరుహురాలగునా ॥

శూరసే—వున్న భార్యతో కష్టముగానున్నపుడు ఇంకాభార్యలుకావలయునా

శూరబాహుడు—ఛీ ఛీ ఈకాంతను మనములలచుకున్నను కొంతదోషము
సంభవించునుగాన మనమనస్సులయందు సహతలంపరాదు.
(అని రాజులందరు వెళ్ళిపోవుదురు)

అంతట బృహత్సేనుండు కృష్ణుని సమీపించి

ఉ॥ దేవమహానుభావ రణధీరపరాత్పర వేదవేద్య సద్భావవిచార
దుష్టజనభంజన కంజదళాక్ష మీరలీభూవరులందరిఁ దరిమి భూ
తలమందున ఖ్యాతిగొంటిరో దేవకీనందనా మిమునుతింతెద గృ
హమున కేగుదెంచుడీ॥

కృ—ఆహా పదండ వెళ్ళుదము మామగారూ॥

సంధి॥ అంతటకూతును అల్లునిదోట్కొని గృహమునకరుదెంచి చెలులఁ
గాంచి బృహత్సేనుండిట్లనియె॥

బృహ—యీ కృష్ణస్వామికి లక్షణాదేవికి తలలంటి స్నానముగావించుడి
చెలులారా!

సంధి॥ అప్పుడు శ్రీకృష్ణుని లక్షణాదేవిని పీటలపై గూర్చుండజేసి తలలంటి
రెట్లనినా?

చెలులు దరువు ఆటతాళము

తలలంటుదమురారే। తరళాక్షులారా। జలజాక్షునకును మనకలికి లక్ష
ణకు ॥తల॥ ముల్లోకగురుడూయీ। నల్లనిసామీ।వల్లవాధరలారా పరమా
త్ముడరయా ॥తలలంటు॥ నలుగిడరారమ్మ నలినాక్షులారా। కలికి కృష్ణునకు
మనకలువంబుంగు ॥తలలంటు॥ పరగశ్రీకటకానిపల్లె శ్రీహరియు పరగున
లక్షణసతిని పెండ్లాడు ॥తలలంటు॥

బ్రాహ్మణులు దరువు ఆదితాళం.

ఒచ్చిరిభూసురవరులు బహు—హెచ్చుగజదువుచు వసనల్ ॥ఒచ్చి॥ స్వ
చ్ఛమైనవస్త్రంబు మదిమెచ్చుచు పిల్చుచువడిగా ॥ఒచ్చి॥ సురచిరముగ వె
లుదండ చినసుబ్బారావును నేలుహరినిదలంచుచుమదిని మురహరుని పెం
డ్లిజేయుంచ ॥ఒచ్చిరి॥

పిచ్చిబొట్లు—ఒరే సుబ్బావుధానీ!

సుబ్బా—ఏమి కక్కునాయినగారూ!

పిచ్చి—ఎన్నాళ్లకెన్నాళ్లకు మనపంటఫలించి మనరోజ్లు కలిశివచ్చినవితా!

సుబ్బా—యేమి కక్కునాయినగారు.

పిచ్చి—ఓరి పిచ్చిప్పా యీరోజురాజుగారింట్లో పెండ్లిముహూర్త్రంగదా!

సుబ్బా—ఓహో! అస్లాగా, మన రాజుగారిదేనా!

పిచ్చి—ఓహో! మావాడు రాజుగారి పెండ్లీ చేయుఘున్నాడే కాదురా భ్రష్ఠా.

సుబ్బా—కక్కునాయినా యింకెవరిదే!

పిచ్చి—వారికుమార్తె లక్షణాదేవిది.

సుబ్బా—ఓహో! అస్లాగా యెవరికిచ్చునో!

పిచ్చి—(తనలో) మావాడికేమి యీ సంగతి బొత్తిగా తెల్సినట్లులేదు ఇస్లా ఇల్లిల్లుతిరిగి గొందుగొందులు శోధించి పౌరోహిత్యంవల్ల నేను సంపాదించుకొని వచ్చిన దాంట్లో మాత్రం ఒక్కపోకచక్క అయినా విడువకుండా భాగం మాత్రం పడుఘాడు వాడు తెచ్చినది నాకు యేమిన్నిచూపడు మా పిల్లకాయలు అర్భకులయినందున నాటనుండి నాకు భాగా టోపిపెడుఘున్నారు ఇంక వీడిఆటలు సాగవులే, మా పెద్దవాడు చాలా అసాధ్యుడు వీడు కోడిని తిందామంటే మా వాడు కోడి, గ్రుడ్లు, కుంపటి కూడా మ్రింగుదామంఘాడు అస్లాటివాడిదగ్గర వీడిఆటలు సాగవులే, మా పెద్దవాడు చాలా అసాధ్యుడు వీడికిగురువు వాడే కాకున్న నాకు వీడి ముందర బ్రతుకుతెరువు వున్నదా!

ప్రకాశము—వరే సుబ్బావుధానీ యేమీా నీవునన్నడిగినది రాచపుత్రి నెవరికిచ్చునని యీా! నిన్నటిదినముమనపట్టణంబున జరిగిన స్వయంవరమహోత్సవంబున ద్వారకాపురవాసుడైన శ్రీకృష్ణభగవానుడు మత్స్యయంత్రముగరికినాడు అందువల్ల మన రాచపుత్రిని ఆ మహానుభావునకు ఇత్తుమని నిశ్చయించినారు వారి

దేయిప్పుడు జరుగబోవు పెండ్లి!

సుబ్బి—అయ్యో నిన్నమనపట్టణమున స్వయంవరమహోత్సవం జరిగి నదా! నేనులేకపోతిని నాకాస్వయంవరమహోత్సవం జూచు ప్రాప్తములేకపోయెనుగదా. అందులో యేమోవచ్చినట్లు నా లుగుదినములనుండి రాత్రింబగళ్లునాకా అరుకలకళ్ళంతో తీరక పోయెనాకు ప్రాప్తములేకపోయె నేనేమిచేయుదును॥

పిచ్చి—మా వాడు యెప్పుడు యింతే ఇహలనమ్మకం లేనివాడు అరుకల కళ్లమట నాల్గురోజులనుంచి ఆకొండక్రింద నేగాని యిల్లు యెరగ డు, కడుపుకు ఆహారంగాని, కంటికి నిద్రగాని యెరగడు. యిదే కాదు ఒకతోటవున్నది ఆతోట సజ్జకారుచేసిన రైతులు మిర్ప చెట్లకు లేవు, మిర్పచెట్లువేస్తె రైతులు రాగికారుకులేవు, పిల్లి పిల్లల తిప్పినట్లు రైతులను త్రిప్పాచాడు పాపము ఆరైతులేమిచే యగలరు, కారుకాకుకు మెన్నోపంచాయితీలు జరుగుతూ వుం ఘావున్నవి కాలావతి వచ్చినదంటె యక్కడచూచిన యీ పం చాయితీలే, నమ్మకంలేని రాజుకు సుఖములేదు, అను పెద్దలవా ఖ్యంబులు తప్పునా? (ఇటులనుకొనుచుండ)

రాజు—అయ్యా! భూసురోత్తములారా! వందనములు.

భూసు—రాజేంద్రా! దీర్ఘాయురస్తు శుభం.

రాజు—అయ్యా భూసురలారా! ముహూర్తం మించిపోకుండా యీ పరి ణయంబు జేయించుడి విప్రోత్తములారా!

భూసు—అలాగే జరిపించెదము రాజేంద్రా; అమ్మా నారీమణులారా!

నారీ—ఆహా యేమి అయ్యవారూ!

భూసు—గీ॥ భూషణాంబరములను పొల్పొందదాల్చి లక్షణాదేవికిని జలజా క్షునకును దీసికొనిరండియిచటికి తేజములర వేగజనుదెంచె సుముహూర్తవేళయిపుడు॥

అలాగే తోడుకొనివచ్చెదము అయ్యవారు! అని కృష్ణుని లక్షణాదేవిని అలంకరించుకొని తీస్కునివచ్చి పెండ్లిపీటలపై నివశింపజేయుదురు.

భూసు దరువు ఆదితాళం.

పెండ్లి జేయించసాగిరి విప్రవర్యులు లాక్షణాదేవికిని జలజాక్షునకిం పుగులుకగ ॥పెండ్లి॥ పెండ్లి జేయించాసాగిరి ప్రేమగులుకంగ పువ్వులబోం ట్లూ మంగళమటంచు పొందూగబాడుచుండ ॥పెండ్లి॥ కంకణాంబులుధరిం చి క్రమమొప్ప వేదవిధిని పొంకామూతోటి వాద్యంబులు చాలామ్రోగు చుండ ॥పెం॥ ఇలనూ కటకాసీపల్లె నేలూచూనుండునట్టి వెలుదండ పెద్ద సుబ్బయవినుతుండైనట్టి హరికి ॥పెండ్లి॥

అప్పుడ విప్రులు మాంగల్యసూత్రంబు కృష్ణునిచేతికిచ్చిరట్లనిరి॥తోహర॥ మురహర నీవీమంగళసూత్రము తరుణికంఠమునగట్టి మురిపెముతో తల బ్రాలుబోయు మేమువ్మాకును నీవట్టి ॥తోహర॥ అమ్మాలక్షణ నీవీతల బ్రాలమ్మురాంతకుని తలపైఇమ్ముగబోయుము ముమ్మారును ఫలియించె ను నీతపమిలపై ॥

వ॥ అని వధూవరులచే తలబ్రాలు నొకరిపైనొకరిచే బోయించిన అం గనామణులు మంగళహారతులుబాడిరటా యెటువలెనో॥

మంగళహారతి దరువు ఆదితాళం.

మంగళంబనిపాడరే యదువుంగవునకు మనలక్షణకు। రంగదంబుజనే త్రునకు। సంగీతలోలునకు సారంగనయనలారా జయ ॥మంగ॥ ధీగుణకు జగదాధారునకు మారకోటి సువిలాసునకు ఘోరకలుష విదూరునకు సా రసాక్షునకును సద్విచారునకును నేడు జయ ।మంగ॥ మేలుగను కటకానిప ల్లెపురి నేలుచునుండు మహాత్మునకు। చాలదయచే వెలుదండ బాలసుబ్బ రావునెపుడు పాలించు శౌరికి జయ ॥మంగ॥

ఇట్లు ఐదుదినంబులు పరిణయంబొనరించి వధూవరుల కేళికాగ్రుహం బునకు పంపించినవారలు తాము కేళీవినోదంబుల ప్రొద్దులుబుచ్చుచు లక్ష ణాభామమీాదిప్రేమతో కృష్ణుండు మద్రపురంబున కొంతకాలమునివసించె.

అచ్చట ద్వారకాపురంబున శ్రీకృష్ణుభార్యలు రాధారుక్మిణి, సత్యభా మ, మిత్రవింద, నగ్నజిత్తి, జాంబవతి, భద్ర మొదలగువారు శ్రీకృష్ణుం డెచ్చటికేగినది తెలియక మోహంబు భరింపజాలక విచారింపుచుండ నా

రయందు హరినామస్మరణజేయుచు వీణ వాయించుచు ఆ కాంతలను చేరు చున్నాడు.

నారదుని దరువు ఏకతాళం.

నారాయణ నారాయణ నారాయణ హరి హరి ॥నా॥ నారాయణ నీ నామస్మరణం చింతలనెల్లను చెలగిహరించుగ ॥ నా ॥ కోరినవారల కోరిక లొసగును నమ్మినవారికి నీ నామం ॥నా॥ చాలదయచే శ్రీ వెలుదండ బాల సుబ్బరావు నెలెటినామం ॥ నా ॥

కృ-భార్యలు—నారదమునీంద్రా! నమోన్నమః ఇదేపది వేలవందనంబులు.

నార—దీర్ఘసుమంగలీ భవ.

కృ-భార్యలు—ఎచ్చటినుండి వచ్చితిరి ?

నార—అమ్మా! యీమధ్య మద్రపురంబునకు పోయి అచ్చట లక్షణా శ్రీ కృష్ణుల వివాహము కన్నులకానందముగా చూచి అచ్చటినుం డి స్వర్గలోకమునకు పోయి తిరిగి బ్రహ్మలోకంబునకు బోవుచు మార్గమధ్యంబున నున్నందున యిచ్చటికివచ్చి మిమ్ములను ఆ కృ ష్ణపరమాత్మని గాంచి పోవలయునని ఆశతో వచ్చితిని, మిమ్ముల గాంచితిని గాని ఆ పరమాత్ముడు కనుపడలేదు, మద్రపురంబు నుండి రానేలేదా ఏమి! వచ్చియుండి మరెచ్చటికె నాపోయినా!

కృ-భార్యలు—మహాత్మా! నిశ్చయమా ?

నార—అమ్మా! ఆ పెండ్లిసంగతి మీకు తెలియనే తెలియదా ?

కృష్ణభార్యలు—తెలియునుమహాత్మా ఎంతపనిచేసెనో చూచితిరా యిం తపనిచేయునని అనుకున్నవారముకాదు మహాత్మ

నార—అమ్మామీరట్టి పిచ్చివారగనుకనే ఆ మహాత్ముడట్టులాటలాడుచు న్నాడు ఆరోజు ఆకృష్ణునివైభవంబును మగ్యామంత్రము సాధించు నప్పటివుదారము ఆకాంతయందు ఆ మహాత్మునకుండు ప్రేమయు ఆ పెండ్లివైభవంబును లక్షణా కాంతను శ్రీకృష్ణుడు ప్రేమించిప్రేమ యు మాకేకాదు చూచువారందరికి హాశ్చర్యంబైనది యీ మ

పోతున్నాండింక ద్వారకాపురంబునకుపోవునా అనియు యిదివఱ్ఱు
వున్న భార్యలను ప్రేమించునాయనియు మేమందరమనుకున్న సంగ
తే నిశ్చయముగా అంతేఅయినను ఆలతుణా కాంతను మీకుచూపిం
చి మిమ్ముల పరిహసించుటకై రావలసినదే మీకు తెల్పునవుకున్నా
ను యేమబ్బా ఆ సాహసము వేయేల ఆకాంతకోరిన తనప్రాణం
బులయినాయిచ్చుటకు సిద్ధంబుగా శ్రీకృష్ణుండున్నవాడు ఇట్టిసంగ
తులు నాకెందుకు నేపోయివచ్చెద ఆ పరమాత్మునియెదుట నాపే
రు బద్దిచేయవలదు తెలిసినసంగతి అడిగితిరిగాన చెప్పితి లేకున్నా
కేమి అని వెళ్ళిపోవును॥

రాధ దరువు ఆదితాళం.

స్వామిరాడాయే నేమిసేతునే ॥ఇక స్వామి॥ మన ప్రేమాతిశయము
కొంచటబెట్టెనో తెలియదాయె ॥స్వా॥ నమ్మరాదమ్మ వానినిమ్మగ నమ్మ
న్యాయమ్ము లేదమ్మ కఠినుండమ్మా ముమ్మాటికిని మన ॥స్వా॥ ఆ కాంతయం
తసుందా రాంగిరో యివు మనలోకామేమియును మదివిలేకయున్నాడు
గాన ॥స్వా॥ ఇలనూకటకానిపల్లెధాముడౌ యీయిల శ్రీ వెలుదండ చిన్న
సుబ్బయ వినుతుండైనట్టి కృష్ణ ॥స్వా॥

అమ్మా సత్యభామా! చాలాదినంబులాయె గదా కృష్ణుండురాక కా
రణంబు వింటిరిగదా! మన మేమిచేయుదము.

సత్యభామ వ॥ అమ్మా! కృష్ణునకడుగుదాటిన అరువదారు గుణంబులను
మాట తప్పునా?

కం॥ ఎప్పుడుకన్నిట్టులమది నొప్పించుచునుండు కృష్ణుడౌ కొ కతరిబల్
మెప్పుగజూచుచు మోహం బుప్పొంగగ ముద్దులాడుచూ చుంకునూ
రమ్మంచు వేడుచుండునూ అందజాతినీ యెండనైన నన్నుండని
యవె నొకదండమునీకం చుంకునూ॥

రుక్మిణి—అమ్మా సత్యభామా॥
కం॥ ఎన్నండైననుకృష్ణుడు యున్నాడనన్నువిడచి యువిదరోయివుడా
వెన్నుడుతన హృదయంబున నెన్నకయున్నాడు మనలానెందుకో

కసమసను జలిసి యుందునో కందనేల గోవిందుడు లక్షణపొందు వదలలే డందునో మరియింకేందునో ||

మిశ్రతిలింద    దరువు    ఆదితాళం.

ఎన్నండా కృష్ణుండువచ్చు నెపుడు వానిజూతునే ఎన్నడు నా తాపమారు నెపుడు కౌగలింతూనే ||ఎన్న|| నెన్నడు భాషింతువాని నెన్నడు ముద్దాడుదు | ఎన్నడు విడెమిత్తు నాతడెన్నడు నన్నేలును ||ఎన్న|| శ్రీ కోణేశ్రీ వెలుదండ బాల | సుబ్బారావునేలీన వేణుగోపాలుండెన్నడు నా విరహాగ్ని చల్లార్చును ||ఎన్న||

సంధి|| ఇచ్చట యుట్లుండ అచ్చట మధురాపురంబునా ||

కృ—నేటిరాత్రి నా కలలో మా రాధ వచ్చి విడెమిచ్చి నాతో కామకేళి వినోదంబులు సల్పి ప్రొద్దుబుచ్చుచున్న నిద్ర దెలిసి చూడగా ఏమియు లేకపోయె, రాధను చూడకున్న భరించగలనా!

ఉ|| ఎన్నడు రాధికాసఖిని నింపుగ నా తొడ జేర్చుకుందు నే నెన్నడు కౌగలింతు చనులెన్నడు హత్తుదు ముద్దుమోవి నే నెన్నడు గ్రోలుచుందు రమియించెడి భాగ్యము గల్గుటెన్నడో | కన్నవయారముల్ గనుల కర్వునుదీరగ గాంచు టెన్నడో ||

సంధి|| అని మనంబున దలపోయుచు మా మగారిచే శెలవు పుచ్చుకొని లక్షణారమణితో గూడుకొని కృష్ణుండు నిజపురంబున కేతెంచెనటా యెటులనెను ||

కృష్ణుడు    దరువు    ఆదితాళం.

ద్వారకాపురమునకపుడు తరలివొచ్చెను | సారసాక్షియా లక్షణతో బలికోరికలరనగ ధీరుడు కృష్ణుడు ||ద్వా|| చేరిభక్తజనులందరు మ్రొక్కగ | తేజుపైన నెక్కి భూరిభేరినినదంబులు మ్రోవగ వారకామినులు ప్రౌఢతనాడగ |ద్వా| శ్రీకరణి శ్రీకటకానివల్లె పురధాముండైనట్టి | ధీరవసును వెలుదండ పెద్ద సుబ్బారావున కాధారుడైనహరి ||ద్వార||

కృ—వ|| (లక్షణాదేవితో గూడి గ్రుహంబున కరుదెంచి) మనోహరీ! నీవు నీ చెలికత్తెయలగూడి యీ గ్రుహంబునందే యుండుము.

భట—మనోహరా! తమ యాజ్ఞానుసారంబే వర్తించెద.

కృ—(తనలో) నా భార్యలలో సత్యాదేవి చాలా ధూర్తురాలు గదా! ఈ నూతనవివాహంబు సంగతి వినియుండును గదా! వినియుండదా? వినకెట్లుండును! త్రిలోకంబుల కెరుకపడిన సంగతి, నా సమాచారమే, విచారింపుచుండిన సత్యకెట్లు తెలియకుండును! తెలియనిమ్ము.

సత్య—చలియా మందారమాలా! ఇటు రమ్ము.

మందా—అమ్మా! వచ్చితి, యేమాజ్ఞ!

సత్య—ఆ వీధిగుండా వచ్చువారెవ్వరు? గాంచితివా?

మందా—అమ్మా! మన శ్రీకృష్ణులవారుగదా! గుర్తించకనేఅడిగితివా? అడుగవలయుననే అడిగితివా?

సత్య—మందారమాలా! నేను ఇంటిలోనికేగెదను, యెవరైనవచ్చిన లోపల రానివ్వకుము.

మందా—చిత్తము.

కృ—మందారమాలా! సత్యాదేవి యెక్కడ? ఇంటిలో యున్నదా? మరెచ్చటికైనను బోయియున్నదా?

మందా—మహాత్మా! ఇంటిలోనే యున్నది.

కృ—లోపలికరుగ వచ్చునా?

మందా—(తనలో) మా రాణి లోపలికేగుచు మరెవ్వరిని రానివ్వవద్దనను గదా! వీరికిప్పుడేమని చెప్పుదును యితరులపట్ల నామెవుత్తరువు ఆచరణీయమే గాని భర్తపట్ల అన్వయించదు గదా! ప్రకాశ॥ మహాత్మా! పోవచ్చును.

కృ—సత్యా, సత్య, మనోహరి, సుకుమారి, ఏమిది గ్రుహంబున లేదా యేమి! ఓహో! కోపగ్రుహంబునజేరి కవాటబంధనంబు గావించియున్నది, కారణంబేమో! మరేమున్నది! నూతనవివాహమే కారణము.

జైలాగు. ॥ రామచంద్రా నన్ను రక్షించరా వేర

## సత్యాకృష్ణుల సంవాదము.

కృ—తలుపూదీయవే సత్య తాళాజాలను నేను తామసించుట నీకు ధర్మమా ?

సత్య—తలుపుదీయను యిదితగని వేళని నీవుతలచవో నను రేయితాళుమా॥

కృ—తాళజాలనే నేను భామినియింక తలుపుదీసియు నన్ను గావుమా వే
ళమించిపోయె వేడుక బలుకేల వేడుకనినుగూడి రాగదే ॥తా॥

సత్య—తాళజాలక నీవు యుండితో వేగతరుణి లక్ష్మణగూడనేగుము వేళాకో
ళములాడ మేలాసీకిదిజూడ చాలుగామాయలు చాలుపోమ్మికి॥తా॥

కృ—మాయలేమియు లేవునాకడ నత్య మన్నించి చూడుమా మోమూని నీ
కాయజుబారికి గాసినొందితి నేను బాయనేనినుమది భామినీ॥తలు॥

సత్య—భామినులెందారోయుండగ నన్ను బలవంత పెట్టుటభావ్యమే కాము
బాధకునీవు గాసిబొందగ మందగామి లక్షణబొందరాదాకో ॥త॥

కృ—లేతమాటలునన్ను బల్కెదామిారి లేమగర్వము ద్రుంచుకొనుమా
నీతిమాలినవారిడ నీటడంచుమనీవు నీ మది యోచించిజూడుమా॥త॥

సత్య—తప్పులెన్నకనన్ను బ్రోవుమా కృష్ణా తలుపుదీసితి వేగగావుమా ।
బాలాసుబ్బరావు నేలుచుండెడికృష్ణ యీలాగుబలుకూటనీమమా ॥త॥

ఇట్లు సత్యాదేవితో కొంతవడ్కు నరసోక్తులచే ప్రొద్దుబుచ్చుచుండి యీ సత్యభామయిప్పటికి నాపూర్వపుణ్యపరిపాకంబుచే శాంతించినది ఇంక రుక్మిణిసంగతి యెట్లున్నదో !

రుక్మిణి—సఖియా కమలా నేటిదినంబున సూర్యాస్తమయానంతరము నిద్ర
సమయములో మనయింటికొక దొంగరాగలడు జాగ్రత్తగానుండుము

కమల—అమ్మా ఎవరాదొంగ రా కారణమేమి ?

రుక్మిణి—కమలా నాకుమాత్రమెట్లుదెలియును.

కమల—దొంగవచ్చుసంగతి తెలిసినప్పుడు వచ్చుదొంగయెవరైనది తెలి
యకపోక దుష్కరమా ?

రుక్మిణి—తెలియకుగాని కమలా దొంగవచ్చినపుడు నీవేమైన కోపము
తో రాళ్లురప్పలు వేసేవు సుమా ?

కమల—అమ్మాతమ పేరుకు పాత్రుడగు దొంగయేనా వచ్చునది అట్ల
యిన సరియే

కృ—యవరచ్చట నుండుకున్నవారు కమలా కమలా!

కమల—మహాత్మా నమస్కారంలు.

కృ—కమలా రుక్మిణి లోపలనున్నదా?

కమల—మా రాణిగారు చెప్పినదొంగ వీరేకాబోలును మహాప్రభో చిత్తము

కృ—మనోహరీ రుక్మిణీ రుక్మిణీ తలుపుదీయుము.

రుక్మిణి—ఎవరువారు కమలా పలుకవేమే!

## రుక్మిణీకృష్ణుల సంవాదము.

జైలాగు ॥ హా ప్రియానినుబాసితే ॥

కృ—గుమ్మమునునడిదీయు రుక్మిణి నిమ్మళించగలేను నే ఎమ్మెలాడిగో క
మ్మవిల్తుని కన్నతండ్రిన కామినీ ॥గుమ్మ

రుక్మి—చాలు పొమ్మిక గోలయేలర చాలు గుమ్మములియ్యరా బేలపలుకు
లు చాలబల్కకు చాలు తెలిసెను చోరుడా ।చాలు।

కృ—కోరినినునే వచ్చినందుకు చోరుడంచని బల్కెదా । చోరుడను నే గా
ను కోమలిగారవించియు బ్రోవవే ॥గుమ్మ॥

రుక్మి—గారవించగ నెంతదానను గొంత లక్షణగూడరా। నేరుపంతయు చూ
పితౌ భళి నేను నమ్మను గారడీ ।చాలు॥

కృ—గారడీడనినన్ను బల్కెదుగాదు చేతిదిచక్రమే మేరమీరినవారి ద్రుం
చగ మేటియస్త్రమే కోమలీ ॥గుమ్మ॥

రుక్మి—కడలికయన వురేడవంచును గానకిట్టులబల్కితినే పుడమిబ్రోచెడి
వాడవని నే నోడలు తెలియక బల్కితినే ॥చాలు॥

కృ—ధరణిలో కటకానివల్లె పురమునా నివసించిన బాలను శ్యారావు నెపు
డు బ్రోచుచుండెడి చక్రినే ॥గుమ॥

రుక్మి—తలుపుదీసితి నన్ను కృపచే ధన్యురాలిని జేయుమా లోపములు మది
నెంచకను నను దావుజేర్చుము బ్రొక్కెదా।

సంధి॥ ఇట్లు వరుసగా రుక్మిణి, సత్యభామల సమాధానపర్చి రాధగ్రు
హంబునకరుగగా॥

కృ—తనలో ఇట్లు రుక్మిణీదేవితో కొంతవర్కు వినోదకరంబగు మాట లచే ప్రొద్దుబుచ్చుకొని ఆహా రుక్మిణి మనసుయిప్పటికి సమాధాన పడినదిగాని యింకరాధాదేవి యట్లున్నదో?

రాధ—చెలియా మణిమాలా ఆ శ్రీకృష్ణుండు యింతదుర్మార్గుండని తెలి సిన నేను మొట్టమొదటనే జాగ్రత్త గలిగియుందుగదా!

మణి—అమ్మా వారేమి జేసిరి.

రాధ—యేమి జేసిరీ యేమి జేసినది నీకు తెలియదా! మద్రపురంబున కేగి అచ్చట లక్షణయను రాచకన్యను వివాహమాడి నేడుగదా మనపు రి జేరినది.

మణి—అమ్మా ఆయమ్మకు యిదివరకు వివాహంబైనదా. లేదా?

రాధ—ఓసీ యిదవరకు వివాహంబై యున్న తిరుగా వివాహంబగునా! ఓ ళ్లు తెలిసియే మాటలాడుచుంటివా.

మణి—అమ్మా ఒకతూరి పెండ్లిఅయిన రెండవతూరి కాకూడదా! నాకు తె లియక మాట్లాడితిని మన్నించుము.

రాధ—మణిమాలా! ఆ కృష్ణుండు మనయింటికివచ్చిన లోపలరానివ్వకు ము నేనువిచారగృహంబున కేగి అందుశయనించియుండెద.

మణి—చిత్తము.

కృ—ఎవరచ్చట! శయనించినది మణిమాలా మణిమాలా!

మణి చిత్తము స్వామీ?

కృ—మా రాధామణి యెచ్చట పవ్వళించియున్నది? లోపలనా! నేను లోపలి కేగవచ్చునా?

రాధ—వీరిని పోవచ్చునందునా అమ్మగారివల్ల తప్పక ముప్పురాగలదు ఆటంకపరుతునా, యీ మహానీయుండు సామాన్యుండుగాడు, నా కేదికర్తవ్యము? మధ్య యీ చావు నాకు వచ్చినది, అయినను చూచెదగాక, అమ్మగారి కోపమును అయ్యగారు సహింపగల రు, అమ్మగారు అయ్యగారి కోపమును సహింపగలదా? గాన వీరికి ఆగ్రహము రాకూడదు.

ప్రకాశము॥ మహాత్మా! పోవచ్చును.

కృ-(లోపలికేగి) రాధా! రాధా! మనోహరీ! ప్రాణనాయకీ! పలుకవేల?

కాంతామణీ! ఇట్లే పలుకకున్న ఈ విరహానలంబున భస్మంబై పోవు వాడగాన, నీ కటాక్ష వీక్షణంబుల నన్నుగాంచి, మన్నించి. పలుకు లనెడి అమృతాంబువులను వర్షించి, ఈ విరహానలంబు జల్లార్పుము ప్రియసఖి.

రాధ—కృష్ణా! ఏటికిట్లు మాటలాడెదవు? నేను జీవించియుంటినని మాటలాడవచ్చితివా? నేను చూచినను. మాటలాడినను అమృతో పమానముగానుండు కాలముపోయి విషప్రాయముగానుండు కాలమువచ్చినది గదా కృష్ణా!

రా ధా క్రు ష్ణ సం వా దం.

క్రు—తరుణిరాధా తమిభరింప తరముగాదికే సరగుననాతోడ నీవు సరస మాడకా ॥తరు॥

రాధ—సరసిజాక్ష మీరరాని జాలియేలరా కోరినకోరిక దీర్చ వారలుండగా ॥సరసి॥

క్రు—ఇందువదన సుందరాంగీ చందమేలనే ఎందరున్నగాని నీ చందముండురా ॥తరు॥

రాధ—ఎంతద్రోహుడ వెంతపాపివి ఎంతక్రూడవురా పంతమేల యిట్టుల నవ్వినయింటికేలామీద ॥సరసి॥

క్రు—ఇందువదన వినగదే నా చందమెల్లనూ వందలు వేలగునా జేసెవందనంబులూ ॥తరు॥

రాధ—బుద్ధిగాదు దూరముపోర వద్దరాకురా వద్దరాక సుతుచుజెప్పిన బుద్ధిలేదురా ॥సరసి॥

క్రు—కాంతయింత గర్వమేల యింతివినగదే పంతమేల నేనురాను చింత మానవే ॥కాంత॥

వచ॥ అని క్రిష్ణుండు వెళ్లిపోవును॥

వచ॥ అంతట రాధామణి క్రుష్ణుండుపోవుట సహించజాలక ॥

రాధ దరువు కల్యాణి ఆటతాళము.

రమ్మానిపిలువాగదే నాసామిని ॥రమ్మా॥ రమ్మానిపిలువావే రమణి ముద్దులగుమ్మ నమ్మాకిమీరాగ వరసునిననుజేర ॥రమ్మా॥ వలపులిలుపవశ

మా॰ నమ్మినదాని వంచించుటలు న్యాయమా ఔలనాగ ఆలదానివలలో దగిలిముద్దు గులుకుమోమిటు జూపదలచాకయున్నాడు ॥రమ్మా॥ విరిబోణి యేమందునే మరుడుపూల శరము వేయగబూననే విరహావేదనచేత వన నాత్మగుందాగ తరుచుమాటలేలా తరుణితాళగజాల ॥రమ్మా॥ ధరణిలోవె లసినట్టి కటకానిపల్లె పురమూన నివసించిరా చాలాగవెలుదంఢ బాలను బ్బయ్యాను పాలించుచుండిన లీలావతారూని ॥రమ్మా॥

క॥ రారాపరమానంద విహారాకనకాద్రి ధీరఆశ్రితజనమం ధారావై రివిదారణ నారాయణ వాసుదేవా నారాదావరదా నీకయమిూరా నను బ్రోచుటరుచా సారెసాకెకును వే సారాకమనమున కోరిభజించెద నేరము లెన్నక నారాదావరదా ॥

కృ—రాధపరితపించుచున్నది యింకతడిసిన ప్రమూదము-అని
కృ—కాంతామణీ రాధా నన్నేలనిరాకరించి మాట్లాడితివి.
రాధ—మహాత్మా మిూకులక్షణాభామను పెండ్లాడినందుకు మాట్లాడితినా.
కృ—మరెందులకట్లంటివి.

రాధ దరువు నీలాంబరి రాగము రూపకం.

గొల్లచెలులజేరవలదురా గోపాలసామి ॥గో॥ చల్లలమ్ముచున్నదాని చల్లబానడుల్లవైచి ప్రల్లకమున కొంగుబట్టి పరిహసింప ధర్మమటర ॥గో॥ విరిశరములుదెచ్చియొక్క వెలదికొప్పునందు దురిమి గుబ్బకుచములమిూద నీదు గోరులుంచ న్యాయమటర ॥గో॥ వనితయొకతె పెరుగుచిలికి వంగి వె న్నదీయునపుడు వెనకవచ్చి మగతనంబు వేడ్క సలుపయోగ్యమటర॥గో॥ వాసిగకటకానిపల్లె వానస్త్రీలు జలకమాడ సరగవలువలు దొంగిలింప న రసమటర చిన్నిక్రుష్ణ ॥గో॥

ఇట్లు రాధామణితో కొంతప్రొద్దు వినోదంబుగానుండి నీలాదేవి గ్రు హంబునకేగగా॥ (వాకిలివేసుకొని నీలాదేవి లోపలయుండగా)

క్రు—మనోహరీ నీలా! నీలా! బాలా! పల్కవేల కోపమా?

నీ లా మా ధ వ సం వా ద ము.

పైలాగు ॥ అరే నంయ్యా ॥

క్రు—ఓనీల వకుమ్యారి సుగుణబాల వాకిలినీదియ్యవే ఓ॥

రాధ—ఓసి ఒకమాటకును కొండువద్దిరచెదువేమె. యిక యెవ్వరిలోనైనను
నియ్యవా నీవాశ్రమము సాగించగలవా చేత కృష్ణునకు నేనిమ్మన్నా
నన్నావా॥

లక్ష—అక్క చిన్ననాటినుండి జవితేసువిడలి పెన్నునిధగునటుల నుంటివే
అత్త నన్నెట్టి ప్రఖ్యాతిగంటివే హరికినన్నిట్లు మెప్పుదుకున్నావే॥

రుక్మి—ఓసి రాధగుర్రమువలె యేవుమీరియు చేయిజారి జగడము చేయ
బూనితివే తేపతేపాకు బహుమాటలాడెదవే మా కాపురంబులు ది
య్యావచ్చితివే॥

లక్ష—అక్క యేవుమీరియుగాగ ఎల్లవారలుజూడ గోపాలుని వెంటవచ్చి
నది మగనిపాపోయెత్తుటలకేసినది ఇంతకోపంబుచే పోరుకేసెది॥

సత్య—ఓసి మాటకెరుగనంటి వేటికె మెల్లగ నాటంచుచుంటివే నెరజాణ
నీనోటికివాలబెట్టింతూవ సిగ్గుపాటగొట్టితివటె చెడుదాన॥

లక్ష—అక్క చెడుదాన్నిగనుకనే శ్రీకృష్ణమూర్తితో విడిబడినేపోరు కేసె
ది శిగ్గువిడచియునెవుడు దూషించేది ఈ పుడమిజెనులకెల్ల దెలియాదె॥

రాధ—ఓసి పరగ శ్రీకటకానిపల్లె గోపాలుని మరగేసుకుంటివె లక్షణ,
మమ్ము మరిపించియుంటివే లక్షణ. ఎంత మాయలాడివె నీవు
లక్షణ.

ఇట్లు కొట్లాడుచున్న సతులఁగాంచి గోవిందుండిట్లనియె॥

గీ॥ జగడమాడక రేటికో ముగువలార
మిమ్ము నంపర నేలుదు సమ్మతమున
హితవుగానుండినను మీకు నతిసుఖంబు
లలరఁజెందును వైరంబు వలదు వినరే।

వ॥ అని చెప్పి యష్టభార్యలకును హితవుగ తెలుగుచుండె గోవిందుడు
భూమిని లక్షణాపరిణయంబను యీ నాటకము జదువనవారును
యశముఁ॥

మంగళహారతి    ఆదితాళం.

మంగళంబురా శ్రీరంగపురవాస రంగధామ నీకు ॥మంగ॥ అంగనమ
ణులు జలంగూడు గుమిగూడి రంగైనపాటాలు పొంగూచు పాడెదరయ్యా
॥మంగ॥ ఎంతో వేడినగాని పంతమా మామీద యితరాలమానిమైన చిం

తదీశ్వరాజ్ఞ ॥మంగ॥ చాలాగవెలుగొంద బాలసుబ్బయ్యాను మేలెంచి యె ల్లప్పుడు పాలించుచుండాలేద ॥మంగ॥

తోహార—సజ్జనులెల్లనుగొనియాడగ నీసచ్చరితము నాటకముగను పరగ ర చించితి శ్రీ బెజవాడ బ్రంహ్మయాఖ్యుడనునేను యీ కథ చదివిన విసిన వ్రాసినను యింపుతోడ శ్రీహరియు సకలసంపదలు గలుగ జేయుచును సం తోషించుచునుండును॥

గద్య॥ ఇది కర్నూలుజిల్లా మార్కాపురంతాలూకా రామసముద్రము గ్రామమం

కాపురస్తులు విశ్వబ్రాంహ్మణ వంశకలశ పారావారసుధాకర బెజ

వాడ సుబ్బయాచార్య ప్రధమపుత్ర బ్రంహ్మయ నామ

ధేయ ప్రణీతంబైన లక్ష్మణాపరిణయంబను

నాటకము సర్వంబును సమాప్తము.

—:o:—

వరసపాటలు.

1. నీ కేల యీ గడుసుదనము నీ పాంటోకులెల్లాను చాల్ చాల్ యిక ను వదిన ॥నీకేల॥ కుప్పిగంతులువైన యొప్పున నీకిది తప్పని మదియెంచ రాదా నీ యుప్పలచాలూ యిదికాదా నే జెప్పిన యికవినరాదా త్రిప్పలా డితొ నీకు యిదివాదా ద్రిమ్మరిమతిలేద సమ్మతివినరాద ॥నీకేల॥ రైలు మూస్తనువాడు కేలూబట్టినిన్ను పూలగుత్తులియ్యలేదా చాలాగనవి గొన లేదా మేలైనచీరలిచ్చ్యలేద బాలారో కంటె గొనలేదా చాలాను సర సాము వ్రాళ్లెల్లదెలసేను ॥నీకేల॥ ధరణిశ్రీ వేఙ్కట్ల ధామానిగొల్పేటి సర సూము కోటీశ్వర్రావు నీ గొనమూల నెన్నాగ్రపోవు అకగ్గించ నీ మదిలావు ని గుణమూలు చేష్టావిపోవు వయ్యారివదినేరో కుమ్మ్యాకె యిక జాలు ॥నీకేల॥

2. ॥అమ్మమాడవేమే॥ వదిన చాలుపోవె వైఖరీలసేను వైఖరీలసేను వయ్యారమిక జాలు ॥వది॥ చక్కనసముగల చుక్కనంచవి నివు నిక్కినిక్కిపల్కేవ్ ముక్కుముూరెడోర ॥వది॥ దొడ్డికాళ్లజూడ సడ్డి మూర్తైదుండె యెడ్డెలినముజాల మడ్డిమేనుజూచి ॥వది॥ కాకికాంతిమేను కోతిమోముజూడ జీ కోటిశ్వరూపె చీకాకుపడె చూచి ॥వది॥

3. ॥పెండ్లికూతురునకుయింత॥ వదినె నీ కథయంత దెలసెను వదరు

చేలనువమానుమా మదినియోమని యెంచియున్నది నాకు కీర్తికథంగ వరా ।వ॥ మచ్చుమచ్చలు నేర్చినానని హెచ్చుగా మదిభాంగదా తుచ్ఛ మంచనిదెంచకికే మదిమ్లేచ్ఛులకే వడిగూడితే ॥వ॥ కన్నుసైగలచేత ప కులమన్ననకు లోనైతివే వన్నెచిన్నెలుచూపి వారివిధిన్నగా వలపించితో ।వ॥ అతివకోటీశ్వరుని పలుకులు యతిముదంబున వినగదే వదినతో యిది కూడదింకను యుపరిపాటునుచూసవే ॥వది॥

4\. ॥శ్రీరామచెంద్రకును త్రిలోకచంద్రకు॥ షోకైన బావకును చోద్యాగపుత్రాపులంట పోకిరులన భువి హీల్ పాల్ పోల్ శాకిమీనూనరూపము ॥షో॥ వంకారచేతులు వాటంపుమాటలు వంగీనగూడలు వహ్వా వహ్వా। తాకిచూడకోపము ।షో॥ కంట్లాతజోడు కాళ్లాకుబూటులు పరిష్లాకకప్పలూ అహాహా ఇంగ్లుచూడగుడిలు ।షో॥ సారాయియంగడి బేరాము యెప్పుడూ తిరాకతిరుగుడూ ఫీఫీ రుమది కోటీశ్వరు ।షో॥

(5) ।పూలూగోతాముదా రే॥ చాలూపరసానూచాలూ చంచానములదీన చెలియానిబల్కేవు ।చా॥ వంకారమూతీని వంకాకుత్రిప్పుమి పెంకేతనముపీడు పొంకాముదిగారబూతు ।చా॥ నూతిబెగించుట ఖ్యాతియుక్తకిది సీతియుగాదు వినుము నిందాబొందుదువింక ।చా॥ అంగానలందారు ఛంగాటనుండగ సంగతి తెలియలేవు పొంగూచునవ్వేవరు ।చా॥ ధారూణిచేజంట్లగ్గూడు శ్రీపాతిగూడూరు కలమణిని కోటీశ్వరునిప్రోచే ॥చాలూ॥

(6) నిన్నుకోరియున్నది అనుమోట్ట॥ మరిడిచాలామంచివాడే మూటలకు నెరజాణుడే ॥మరి॥ పరువుమెరుగక నరనకూడును పారుబోత్రీధుడు ।మరి॥ ఇంగ్లాండువెల్లి యితడుఇంగ్లీషుచదివెనే ఎంగ్లితిండ్లూతినునె యితడు యిల్లనిలువునదీయునే ।మరి॥ కులము బేధము లేదటంచు కూళితనముజూపుచు లలనలెక్చరులిచ్చుచుండును కేలుచాలాయెత్తుచు ॥మరి॥ యస్ ఝుస్సాయనుచు నెప్పుడు యేకరీతిగబల్కునే యస్సు పిమ్మట థ్యాంకియనుచును యేమిటింతగబల్కునే ॥మరి॥ ధరని శ్రీ కోటీశ్వరప్రాపుని దయతో బ్రోచెడి శౌరినిమరువకను మదిదలచుచుండిన మంచినడతగలుగునే ॥మరి॥

7\. ।సొగసుగంటిరే సొగసుకాయుడే వికటమైనచాలా ।సొగ॥ దిగులూబొందాజేయు రూపుగలేజూడ ।సొగ॥ తళుకులీను కల్లజెళుకు

కాంతిమేను చెలువుమీరముక్కు తెలయూదూలమనా ॥సొగ॥ నిర కొసా
రగ్రోలి భరితముగనుండు పరమనీతిపరుడు కరుణ్తీవమ్ము చాలా ॥సొగ॥ క
ల్లునీల్లాకొరకు ఝల్లుకొల్లగొ నను చల్లానయ్య యిలనియల్లామెము చపుమ
॥సొగ॥ ధరణి శ్రీ వేజండ్లధానుశోభనిగొల్చు వరజీ కోటీశ్వరు వరదూడే
యిశసాక్షి ॥సొగ॥

8. ॥పెండ్లికూతుర నీకుయింత॥ మెట్టు॥ మురదలా నీ కేలయింతిటిమ
దము నాతో జెల్పవే బిరుసుతనమును పీడకనువడి బింక మేలనుజూ పెదా
॥మర॥ కంటకాసులరూపు చడి నీ వంటిమెడలో వేయుగా వంటనంచనిమా
రుబల్కెడు త్రొటిరసముల ద్రావియు ॥మర॥ అందమైనవిటులతో మీ
అక్కలందరు జేరిరి చందమంతయు దెలిసె చాలు న నభయ లెల్లరునవ్విరి
॥మర॥ ఆతివ కోటీశ్వరుడు నినుగని అన్నుతముగ డునోందనే మతివిహీనవృన
నులు జేయక మాతో సరిగానుండవే ॥మర॥

(9) మదనానాపై యింతచలమా మట్టు॥ రమణానాపై కృపగనుమా
ఇదిఘనమా కృపగనుమా మనవినుమా ఇకజనుమా ॥రమ॥ పూలబంతులై
న అలసాటజెందియు గలకాజెందెను మేనులు కాలెత్తియుజాలా ॥రమ॥
విరిబంతిచేకొని వారిజవదనాడ మరి మరియై చేసు నై రాముబెంచీయు
॥రమ॥ యేమిజేసియుంటి నా దిందనీటులైన తామానమేలాను కామూని
జనకూడ ॥రమ॥ రాకాసిమదహార నీకుమ్రొక్కెదనిక లోకమోహనకృష్ణ
జ కోటీశ్వరనుత ॥రమ॥

(10) అరేసంయా మెట్టు డైలాగ్॥ ఓ రామా శృంగారపుగుణభా
మా బంతులనాడవేమ ॥ఓరామ॥ చాలుసరసమూ చాలూ చాలుపోరమూ
ర సుందరాకార ॥చాలు॥ ఇంతీ సుగుణాలమేటిదాంతి కుసుమంపునీటుబంతి
నడకాలమత దంతి వినుమింతి విరిబంతి గనుకాంతి గొనుబంతి ॥ఓరా॥ ఓ
రా పడతితో నాడనార పలుమారు వేయకూర పరువూకుభంగమౌర ఉడుప
తిరా వదలితిరా వెరచితిరా పనివిడరా ॥చా॥ చిలుకామారూనిచే పూములు
కా పలుకూలసుధాజలుకా వేలానేనాపై నలుకా మరుచిలుకా ఇడియలుకా
తగదికా పనితిలకా ॥ఓరా॥ కావూ కౌగిటజేర్చి బ్రోవు కరుణాలవాలరావు వే
గకోటీశ్వర కావు నుతిగొనవు ననుగనవు యిదివినవు ధృతిచెడవూ ॥చాలు॥

(11) ఖ్యానారీ మెట్టు— మల్లెబంతూ లాడుమామువలయూ॥ పల్లవి— మల్లెలుడాపూంతి మరువంపుజాజులు కొల్లాలుగానుండె మెల్లాగ్గనై చేద ॥మల్లె॥ అచ్చెయిననదవనంపు హెచ్చుబంతిడిగా ముచ్చాటగనైతు మెచ్చా మునన్నలికి ॥మల్లె॥ బాలరో రుక్మిణి బాలకృష్ణుడనే జాలమేలనుయింలి తె య్యానరావే ॥మల్లె॥

(12) హాప్రియా సనుబాసితే॥ మెట్టు॥— బంతులాడగను భామబిలు వగ పంతమేలను శ్రీధరా యింతబింకమూ కింతుజనకుడా చెంతచేరియునాడ వా ॥బం॥ పోకుగను విరభాజిబంతులు జోకతో డుతనాడుమూ ఫీకజూపగనీ కెసమయముగాక యేటికిమాధవా ॥బం॥ నందనందన జాలమేలర అందము గనికనాడరా సుందరాంగీరుక్మిణియునీ యండమునుగని వలచెరా ॥బంతు॥ పొన్నపువ్వులు సన్నమల్లెలు సిన్నరేయినగూర్చిరి వన్నెమీరగదాన్నిగై కొని సన్నుతాంగితోనాడుమూ ॥బంతు॥ నమ్మిబి కోటీశ్వరుడునికా సమ్మతిగ ప్రార్థించెనూ కొమ్మగూడియునాటలాడుము సిమ్మళముగ రమావర ॥బం॥

13. ॥బాలరావే॥ మెట్టు॥ బంతులాడవె భామినీమణి బాలకృష్ణుని గూడియూ వంతులేలను బంతివిడువుము నాతినముచే నింతిరో ॥బం॥ దంతి వరము పంతమూనకు పొంతజేరినబ్రోచునే మందగమనరో సర్వజగముల పొందుమీరగగాచునే ॥బం॥ కడలిపుట్టువుధరుడె కోమలి కడలికూతురు కాంతుడే కడలివెన్నకు ముద్దుమురదుడె కామినీమణియాతడే ॥బం॥ వర ములిచ్చెడివాడె ధీరుడు వాదిజాక్షిరో కృష్ణుడే పరమపూజ్యుడె భాగ్యశీలు డె పురుషసింహుడె పూజ్యుడే ॥బం॥ వివిధిగను వేజండ్లపురి వీహారుడే గో పాలుడే అరయుచును కోటిశ్వరావును సురచిరంబుగబ్రోచునే ॥బంతు॥

14 ॥రాజరజగజానన॥ మెట్టు॥ బంతులాడుమురహార యింతితోడ మల్లెపువ్వుల ॥బం॥ బంతినుమబంతీ యిదిచెంతవేసెదగ వింతాగనాడుమా ము సంతానంబుననాతో ॥బం॥ భూరిపాపళయనచేద ఘోరరూపదాన వాంతక సారా సువిచారా సురవీరపూజితా మరువంపూ బంతూలు సర సారీ విహువార ॥బం॥ నారదమునివందితా ధీర వేజండ్లపురిని వాసా రమ్య యీశాగుణ్యక్రూరా వినాశ వారాడివార దేవ కోటిశ్వరసురతపోష ॥బం॥

15. ॥నీవారశూకాగ్రమున నిల్చినావే॥ బంతులాడరకృష్ణ బాలకు

క్మిణితో పంతమేలర యింత యింతిబిలువగాను ।బం॥ మంచిముల్లైపెండ్లము ముపంపుగుండ్లు మధుసూధనరార మూటలికేల ।బం। మందారగిరిధర ఇందిరవర యిందీవరాక్షికి సందివ్వవేర ।బం। సంపంగివిరులాను సన్నజాజులాను సఖియలెల్లగుగూర్చి సయ్యాటచుండె ।బం। ధర జి కోటిశ్వారుపై దయ జూపుశౌరి తడవేలజేసేవు దరిజేర వేగ ।బంతు।

16. ।సందేహించనేల మంచినసురైనవారలె। పూబోణితో బాల కృష్ణుడు పూలబంతులాడనే పూలబంతులాడియాడి పూబోడితో గెల్చెనే ॥పూ॥ మల్లెలుమొల్లలు జాజి మంచిసంపెంగి విరులతో జల్లగనాడి సఖియ నోడజేసెనే ॥పూ॥ అత్తరు పన్నీరులందు అందముగాముంచిరి మొత్తనిరో జాలగుత్తులానుగొట్టిరి ॥పూ॥ పునుగు అగరువత్తులాను అనవురవెలిగించి రి మా[illegible]బోచు మంగరగిరిధారుడే ॥పూ॥

(17) రాకేందువదనాసి॥ మెట్టు- మంగాళమిదిగో మదనా జనకా ॥మంగా॥ గంగాధరునీ సఖుడాగొనుపూ ।మం॥ కరిరాజవరదూడ కాం చానచేలూడ నరకాసురుని హరియించినశౌరి ॥మంగా॥ మునిచంద్రా చంద్రూడ మురవైరికృష్ణుడా అవనిన్ కనిన్ మనమున్ కలుష ।మం।గూ డూరు కోటీశ్వర్ కృపతోడబ్రోవగ వడినీయకుకుల్ విడకన్ గొలుతున్ ॥మంగా॥

(18) శ్రీ కాం తా రీ॥ మెట్టు-

శ్రీ రా మే శా శ్రీరమేశ భవమతమంగళం చిన్మయూత్మకానీకు మం గళం ॥శ్రీ॥ నీ లా నా ధా నీలవాధ నిత్యమంగళం నీరజానవా నీకుమంగ ళం ॥శ్రీ॥ రా తూ సాం తా రాతుసాంత రఘుకులేంద్ర నీ రాజనంబురా రావణాంతకా ॥శ్రీ॥ గూ డూ రూ కో గూడూరుకోటీశ్వరా వునిన్ ధూ ర్మిమారబ్రోవరా కూర్మరూపకా ॥శ్రీ॥

19. ॥హాంప్రియా॥మెట్టు॥ చందనమును బూతురారా నందనంద నవేగమే సుందరాంగ మందహాస అందముగ నీ మేనుకు ॥చం॥ కడలిక యునా గరుడవాహన కరుణసాంద్రరావెరా హరునిహితుడా దురితహరు డా మురునిటనకారావెరా ॥చంద॥ రాధతోలా వాదమేల వోడప్రార్థిటు జూడరా సుదతులెల్లను జూచుచుండిరి సురచిరాంగుడరావెరా ॥చం॥ వా సిగను వేజండపురిని వాసశౌరిరావెరా అతిచే కోటీశ్వరుడువే దోసిలొగ్గ

మేరాన్ని రా॥ వంద॥

(20) యేమనీ వని మున్నలాడి॥ మెట్టు- చేడేనికుడు ఋతడు జో మూ కాదనియసకి నేడా జేసినా రే చెల్లి కల్లనికూపూ వాడే మెజోడ పల్లవుకొ న్నూ లెజాడగా వల్లిల్లవుండ్లేమె. వంకాసకాలేమె రామూ చూడూ వేమూ ॥చేడా॥ త్రాగుబోతులగూడియుండియూ యితేమనాగుచుండేన బాగా పొ చ్చుగా త్యాగినంచనిచాలా చాతుర్యమును జూపు రామూ చూడు వేమూ ॥చెడ॥ బోటియింతటిమాయకాడే మెవీను పాల్పాడి గొంతూలుకోయునే మేటి వేజంగ్లాలో కోటిశ్వరుడెసాక్షి రామూచూడు వేమూ ॥చెడ॥

21. ॥ అంగనాలో తమినిల్పజాల॥ మెట్టు॥ మంగళమః గంగవినుతధీ రా సంగారధీర రార వేగా ॥మ॥ బంగారుపల్లేరమందూ అంగనలు నీరాజ నముదెచ్చే ॥మం॥ వారిజాసనాదివినుత దేవ మారజనకరార జాలమేల ॥మం॥ ధరణీశ్రీ వేజంగ్ల వాసా దయజూపు కోటిశ్వరుని యీశా ॥మం॥

22. ॥మంగళహారతి॥ వేమాకతో ంత కోరియున్నదిరా జయమంగళ మీదే జలజాక్షా రారా జయరాధాలోలా జయశ్రీకృష్ణా ॥జయ॥ జయరా ఘసాంతాకా జయదేవవీరా జయయాదుకులచంద్ర జయమానిచంద్ర ॥జయ॥ జయధీరమందార జయక్రూపాలా జయభక్తజనపాల జాగేలశీలా ॥జయ॥ జయపాండవపక్ష జయకౌరవశిక్షా జయహరనలువాది వినుతాజ గమన్నత ॥జయ॥ వరసీజనాభా సామ్రాజ్యధీరా నిరుపామగుణశీల నిర్మా లహృదయా ॥జయ॥ మురహర హరరాజా వనచక్రధారా కరుణించు కో టిశ్వరవినుతా సుకుమారా ॥జయ॥

23. ॥విన్నా కోరియున్నది॥ మెట్టు॥ యువ్వమును వడి మెనవంరా పుప్పొ బోడుఋ తెచ్చికి నవ్వ లేలను యింకమీదట కవ్వసెప్రియరావారా ॥బు॥ బం గరరటియాకులందున రంగుదీరినభక్ష్యముల్ పొంగుచును వడ్డించిరిప్పుడు అంగనలుగుభక్తిచే ॥బు॥ ఘృతమఃలాద్యము నెల్ల నొడ్డిరి హితముగా భ క్షింపరా అనిముఃఋప పాయసంబులు ఆవుపాలనుదెచ్చిరి ॥బు॥ జాలమే లను లేచిరారా చాకుబ్బంవముండెరా చాలవేళామించెనిప్పుడు జనులు వేచి యుండిరి ॥బు॥ ధరణి జి కోటిశ్వరావుకు దయతో వరములొసెగెడి హారు డవీ వెడయైన పుడమిని పరుగులిడుచురా వారా ॥బు॥

24. ॥నా ముద్దుకృష్ణా నా మోహనాంగ॥ మెట్టు॥ గంధముబూతు మందరధర నందనేలరా నందడీయేల శ్రీధరరార పొందుమీరగా ॥గం॥ అత్తరుకన్నీట అతివలుదీసిన అగరుగంధము చిత్తజజనక చిత్తమునింధుగ చిత్తగించరా ॥గం॥ పునుగుజవ్వాజి పుష్పాది పూయు నంచిన్ పునుకడాలు పునఖుడరార పూజజేతుము ॥గం॥ ధరణివేజండ్లధాము శౌరిదయతో జీ కోటీశ్వరుని బ్రోచెడి పరమపురుష శ్రీ రామావరా॥గం॥

(25) వియ్యాలవారిపాట బువ్వముబంతిపాట॥ అయ్యయొయ్యానగుబాటు వియ్యాలవారింట విందులిట్టుగజేసీరీ చెయ్యాతడిగాకుండా నెయ్యావడ్డించీరి సిగ్గులేదాకోపికీకీ ॥అయ్యయొయ్యా॥ పూర్ణాలువండీరి పుక్కిటికి చాలా పుపులిసీనవరిపిండీచే నిర్ణయించిరి కూరలొసీటియాకులుదెచ్చి నీతిమాలిన వారాలూ ॥అయ్యయొయ్యా॥ అప్పడాలు వడియంబు అనలేలేనందున అందని కివెగటాయనూ పప్పూమును పేలేదూ పరమాన్నమది సున్నపకపాకనగిరి క్కారు ॥అయ్యొయొ॥ ఆకులుపోకలు లేపూ జొరా యేమనిచెపుదు అంతాపెద్దలెపెండ్లికి లాకుయేత్వామిచ్చి దకొమ్ములిడిచూపి పెద్దాలవలెమీరు బుద్ధీగలిగుండాకా ॥అయ్య॥ సరసామెరుగని పెండ్లి చాలాగజేసీరీ తలవంపునూకాయనూ పసుపు తెలియనివారు పలహారముల్లేవు పలుకూ టేమర్యాదనూ॥ అయ్యయొయ్యా॥ ధరణీశ్రీవేజండ్ల దామూడౌ శ్రీహరి కరుణా లేకనుషుపకూ అరుద్దైపోయెనుతిండీ ॥అయ్యయొ॥ నగుబాటూ వియ్యాలవారింట విందూలిట్టుగజేసీరీ॥

(26) అమ్మాయికి మనిలోన దిగుబానుబొందకే॥ మంగళంబు నుంగరాంగ మాతజనకగ్రైకొను మారజనకగ్రైకొను మన్నించినన్నమా ॥మ॥ కర్పూరపుహారతిని ఘనముగనిచ్చెదగ ఘనమూగనిచ్చెదగ మనసూను పొంగగ ॥మం॥ పాండవపక్షపాతి పాలనేత్రమిత్రమా పాలనేత్రమిత్రమా పాలించిగాపుమా ॥మం॥ దనుజహరణ కరుణగను ధారుణిపన్నికగ ధారుణిపన్నికగ వేమాగబాడకగ ॥మం॥ ధరణి జీ కోటిశ్వరునిదయచేత బ్రోపుమా దయచేతబ్రోపుమా ధన్యానిజేయుమా ॥మం॥

(27) పూలుబాసో కామూర్కారే ॥మెట్టు- బువ్వాముబంతిగన పూర్ణేందుముఖులార పొదాము పేగార్కారే తొమ్మిది కాయగూరల్ తరుములారా

జూడ కమ్మాగిగా రేలు ఘనమైనయరిశేలు ॥బువ్వాము॥ ... దైనలు హోళి
గలు యింపైనపూరీలు పణతులారావుంచి పులిహోరతో నున్న ॥బువ్వా॥
చక్కెరాదిపొంగళుల్ చక్కానివుప్మాలు చందానగంధీకో చాలాగదోసేలు
॥బువ్వా॥ కమ్మానికాఫీ టీలూ కాంతాకొచూసుమిక గమ్మానితెమ్మెర
గల్గినవీడెమూలు ॥బువ్వాముబంతిగిన॥ జాలాగవింతలచే బాలానాకోట్రీ
శ్వరుని పాలించుచుండీన పారీజాతాపుహారి ॥బువ్వాము॥

## మంగళహారతి

మనాకు మంగాళము పాడరే వరనబృందావనమునందు చాలవు
నదే. ... తరుణులాది సతులగూడి సరసమాడుచుండునట్టి ॥ మా ॥
స్నిగా పల్లెవాడల వెన్న పాలు నెయ్యి పెరుగు లన్నిద్రావి దుడుకుతన
మమితముగనుసేయునట్టి ॥ మా ॥ పున్నపువెన్నెలబైట పొన్నగున్నల
గోప కన్నియలతో మరుని కేళిగలసి మెలగుచుండునట్టి ॥ మా ॥ ధ
రలయు శేషశైలపురనివాసుడై సదా కరుణమీర సర్వలోకమూలు
చుండునట్టి ॥ మా ॥ స్థిరముగా వరదేసివాసుడు శ్రీ...రేకృష్ణాయ
మ శరణువేడగ మెచ్చి యతని సరగునపాలించునట్టి ॥ మాధ ॥

